# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

**ANDHRA RASTRA PRARAMBHA VIDYA**

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 30 | ఏలూరు 15 మార్చి 1942 | సంచిక 12 |
|---|---|---|

## నిత్యసంకీర్తనము

**వివరణము :**

సద్వస్తుసందర్శనము మన భావముల కందదు. మన కాస్థితి లభించినపుడు ఈ యోగ్యతాయోగ్యతలు, భోగభాగ్యములు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములు, కనుపట్టవు. మనకొక నూతనశక్తి యలవడును. ప్రపంచమంతయు నూతనస్వరూపముతో, నూతన వికాసముతోఁ, గన్పట్టును. లోకవ్యాపారమునకుఁ గొంతకాల మావశ్యకమగునట్లే మన యాధ్యాత్మిక సాధనమునకుఁ గూడ గొంతకాలమును వినియోగింపవలెను. ఈవిధముగ మనము నిత్యమును జేయుచున్నచో మనకుఁ దప్పక దైవసందర్శనమగును.

**సంకీర్తనము :**

హే సర్వాంతర్యామీ ! నీసాయమేకాని నా స్వతంత్రశక్తి యొందులకును కొఱగాదు.

2. నాకర్మకలాపమేగాక నాజీవిత సాధనమంతయు నీ సంకల్పము ననుసరించుఁగాక !

—స్వామిపరమానందతీర్థులు.

ఓమ్

# చైనా దినోత్సవము

మహావాది వేంకటరత్నము బి ఏ

(7—3—1942)

గీ. భరతభూమికి చీనాకు బాంధవంబు । నూతనముగాదు చాల పురాతనంబు;
రెండువే లేండ్లనుండి యీరెంటిపొత్తు । చెదరకున్నది హిమశైల శిఖరమట్లు॥
చ॥ రణవిలయాగ్నికీలలు సరాసరి గ్రమ్మెను విశ్వమెల్ల; భీ
షణ పరితాపదుర్భర విషాదమహోదధి మేరమీరె; ర
క్షణమున కేమిదిక్కని యజస్రము యుద్ధపిశాచభీతితో
వణకుచునుండె తూరుపు ప్రపంచము క్రూరజపానుదాడికిన్॥ ౧
ఉ॥ తూరుపుదిక్కులంకలకు దుర్గము సింగపురంబు దుస్సహ
క్రూరశతఘ్ని దావమునకుం గురియై పడిపోయినప్పుడే
చేరువయయ్యె పోరు మనసీమకు; శత్రుపురోగమ ప్రతీ
కార మొనర్పకున్న నపకారము తప్పదు మాతృభూమికిన్॥ ౩
మ॥ మలయాపోయెను; సింగపూరుపడె; బర్మాపౌరలోకంబు మం
టలలో మ్రగ్గెన; నండమానులపయిన్ వైమానికజ్వాల ప్ర
జ్వలియించెం దొలిసారి; యింకనయినన్ జాగేల? సంగ్రామ సి
ద్ధులరై భారతయోధులార! రిపులన్ దూటాడి యోడింపుడీ! ౪
శా॥ చైనాయోధులవోలె సోవియటు రష్యావీరు లక్ష్యైకమై
ప్రాణంబుల్ బలివెట్ట సిద్ధపడుడీ! స్వాతంత్ర్య సంసిద్ధికై
మానం బూడిననాడు ప్రాణము రుచింపంబోదు, వీరాహవ
శ్రేణిన్ డీకొనుడీ జపానుబలమున్ చీనాసహాయంబుతో॥ ౫
శా॥ నానామానవ శాంతిజీవన విధానస్థాప నాచార్యులై
చైనాపౌరులు భారతీయులును ప్రాచ్యక్షోణిలో సాగు యు
ద్ధానన్ జేతులుగల్పి పోరుటకు నుత్సాహించుచో జర్మనీ
సేనాంగంబు జాపానుదేశబలమున్ చీకాకు గాకుండునే? ౬
మ॥ స్థిరసంకల్పముతో స్వతంత్రతకునై చీనాప్రజానీక ము
గ్రరణాగ్రంబున పోరుచున్నది మహోగ్రస్ఫార వీరంబుతో
భరతోర్వీ బహుళప్రజాబలము తోడ్పాటింత గాకుండె దు
స్తరవైదేశిక దాస్యబంధమున శుష్కప్రాయమై పోవుటన్॥ ౭

మ॥ చెలికాడైన చియాంగుషేకుపలుకుం జెల్లింప నింగ్లాండు మం
త్రులు స్వాతంత్ర్యము భారతీయులకు తోడ్తోనిత్తురేని మహో
జ్వలమై భారతయోధవీరుల ప్రతాపజ్వాల ప్రత్యర్థి దో
ర్బల భూమీజము గాల్పకుండునె? జగద్భద్రాను సంధానమై॥ ౮
సీ॥ అరివీరగహనార్చియై మించు రసపుత్ర, పౌరుషజ్వాల చల్లారలేదు
కండలు తెగుచున్న ఖడ్గంబు వదలని, సిక్కులధైర్యంబు చెదరలేదు
మడమత్రిప్పక పోరు గడుసుమహారాష్ట్ర, వీరుల శౌర్యంబు విఱుగలేదు
మరఫిరంగులకైన మలఁగక యనిసేయు, తెలుగుజోదులశక్తి తొలఁగలేదు
గీ॥ ఇన్నిటికితోడు సాతంత్ర్యమున్న యెడల । కడిమి దీపింప మిత్రపక్షంబు చేరి
భరతపుత్రులుసర్వప్రపంచశాంతి । కొఱకు పోరాడెదరు కోట్లకొలది నేడు॥౯

---

# హిందూదేశ చరిత్రము

## (4 వ తరగతి - ప్రశ్నోత్తరములు)



వేదుల అన్నయ్యశాస్త్రి & తాతా జగన్నాథరావు

(N. B. మద్రాసు దొరతనమువారి 1939 సం॥రపు ప్రాథమిక విద్యాప్రణాళిక ననుసరించి యీప్రశ్నోత్తరములు రచింపఁబడినవి)

Syllabus Heading :— Our country.

1. మనదేశము యేఖండములోనిది ?

జః ఆసియాఖండములోనిది.

2. మనదేశమునకు గల నామములేవి ? అవియెట్లుగలైను ?

జః మనదేశమునకు హిందూదేశము లేక భరతఖండమని పేర్లుగలవు. గొప్పదగు సింధునదిమనదేశములో ప్రవహించుచుండుటచే దీనికిసింధుదేశమని పేరు వచ్చెను. క్రమక్రమముగా సింధుదేశమనునది హిందుదేశముగా వాడబడుచున్నది. పూర్వమున్న భరతుడనురాజు యీదేశము నేలుటచే భరతఖండమనియు పేరుగల్గెను.

3. మన దేశముయొక్క ఎల్లలను వ్రాయుము ?

జః మనదేశమునకు ఉత్తరమున హిమాలయపర్వతములును, తూర్పున బంగాళాఖాతమును, దక్షిణమున హిందూమహాసముద్రమును, పడమర అరేబియా సముద్రమును ఎల్లలుగానున్నవి.

4. మనదేశమందలి ముఖ్యమగు పర్వతములేవి ?

జః హిమాలయ పర్వతములేగాక దేశమునందలి మధ్యభాగమున్న వింధ్యపర్వతములును, వానికించుక ఉత్తరముగాగల ఆరావళీ పర్వతములును ముఖ్యమైనవి.

5. హిమాలయ పర్వతములనుగూర్చి క్లుప్తముగా వ్రాయుము ?

జ: హిమాలయ పర్వతములు సుమారు వేయిమైళ్ల పొడవుగల్గి ప్రపంచములోనిక్కెల్ల చాల నెత్తైన పర్వతములు యీపర్వతము లెల్లప్పుడు మంచుతో కప్పబడి యుండుటచే యిచ్చట చలి మిక్కుటముగానుండును. యీమంచుగోడలు ఉత్తరదిశనుండి మన దేశముపైకి శత్రువు లెవ్వరు దండెత్తిరాకుండ గాపాడుచున్నవి. యీపర్వతములందలి కైబరు, బొలాను కనుమలు దేశచరిత్రతో సంబంధము గల్గియున్నవి.

6. ఉత్తర హిందూస్థానము, దక్షిణ హిందూస్థాన మననేమి ?

జ: మనదేశములోని వింధ్యపర్వతములకు ఉత్తర భాగము ఉత్తర హిందూస్థానమనియు, దక్షిణభాగము దక్షిణ హిందూస్థానమనియు పిలువబడుచున్నవి.

7. మన దేశమందుగల ముఖ్యనదులేవి ?

జ: ఉత్తర హిందూస్థానమందలి సింధు, బ్రహ్మపుత్ర, గంగానదులును, దక్షిణ హిందూస్థానమందలి మహానది, గోదావరి, కృష్ణ, కావేరి నదులును ముఖ్యమైనవి.

Syllabus Heading :— Alexander and Porus.

1. అలెగ్జాండరేదేశస్థుడు ? యితని స్వభావమెట్టిది ?

జ: అలెగ్జాండరు గ్రీసుదేశస్థుడు. యితని తండ్రియగు ఫిలిప్పు గ్రీసుదేశములోని మాసిడానియా కధిపతి. అలెగ్జాండరు తన బాల్యమునుండియు యీడునకు మించిన ధైర్యసాహసోత్సాహములను, యుద్ధకౌశలమును చూపుచుండెడివాడు. అలెగ్జాండరునకు శత్రువులన్న కోపమేగాని, వారులొంగినప్పుడు మాత్రము వారిని గౌరవించి విడిచివేయువాడు. అవసరమగునప్పుడు దయాదాక్షిణ్యములు విడచి క్రూరకృత్యములను చేసెడివాడు.

2. అలెగ్జాండ రెన్నవయేటరాజాయెను ? ఇతని పాలనమున గ్రీసుదేశమెట్లుండెను?

జ: ఇతడు ఇరువదవయేట గ్రీసుదేశమునకు రాజాయెను. ఇతనికాలమున యీ దేశము వివిధపరిశ్రమలయందును, నాగరికత విద్యాబుద్ధులయందును ప్రఖ్యాతిగాంచెను.

3. అలెగ్జాండరేయే రాజ్యములను జయించెను ?

జ: ఇతను మొదట గ్రీసుదేశమును, పిమ్మట పారశీకదేశమును జయించి మన దేశమందలి పంజాబు రాష్ట్రముపై దండెత్తెను.

4. అలెగ్జాండరు మనదేశములో ఎవరితో ఎచ్చట యుద్ధముచేసెను. దానిఫలితములెవ్వి ?

జ: అలెగ్జాండరు పంజాబు రాష్ట్రమందలి జీలం, చీనాబ్ నదులమధ్య ప్రదేశమునకు రాజగు పురుషోత్తమునితో జీలంనది యొద్దున యుద్ధముచేసెను. పురుషోత్తము డోడిపోయెను. యితనిని అలెగ్జాండరు ఖైదీగా పట్టుకొని, పురుషోత్తముని ధైర్యసాహసములకు మెచ్చుకొని అతని రాజ్యమతని కిచ్చివేసి పురుషోత్తమునితో స్నేహము చేసెను.

5. అలెగ్జాండరు మరణ మేసంవత్సరమున ఎట్లు తటస్థించెను ?

జ: ఇతడు బాబిలన్ పట్నములో జ్వరమువచ్చి క్రీ. పూ 317 లో మృతి నొందెను.

Syllabus Heading .— Asoka the great.

1. అశోకుడే దేశపురాజు ? దాని రాజధానియేది ?

జ: అశోకుడు మగధ దేశపురాజు, దానిరాజధాని పాటలీపుత్రము.

2. ఇతడెన్ని సంవత్సరములు రాజ్యమేలెను ?

జ: ఇతడు క్రీ. పూ. 272-232 వరకు అనగా నలుబది సంవత్సరములు రాజ్యమేలెను. (సశేషము)

---

# సివిక్సు - 4 వ తరగతి

(ప్రశ్నోత్తరములు)



వేదుల అన్నయ్యశాస్త్రి

హెడ్మాష్టరు - బోర్డు ఎలిమెంటరీస్కూలు - గురమ్మపాలెం.

తాతా జగన్నాధరావు,

హెడ్మాష్టరు - బోర్డు ఎలిమెంటరీస్కూలు - సాంర్యాం.

(N. B. మద్రాసు దొరతనమువారి 1939 సం|| రము ప్రాథమిక విద్యాప్రణాళిక ననుసరించి యీ ప్రశ్నోత్తరములు వ్రాయబడినవి. ఇవి విషయానుక్రమణికను అనుసరించుచున్నవి )

Syllabus Heading.—Duties towards neighbours, beginning with class fellows, teachers and others, cleanliness in home and school premises, pla ygrounds etc; importance of practising health rules, emphasis on clean food, fresh air, exercise and rest communicable ailments; precautionary measures; daily health living

1. కుటుంబమునందలి యజమానియొక్క బాధ్యతలేవి ?

జ. కుటుంబమునందు అందరకును కావలసిన ఆహారపదార్ధములను సమకూర్చుట, బిడ్డలను సత్ప్రవర్తన గలవారిగా నొనర్చుట, వారి విద్యాభివృద్ధులకు తోడ్పడుట, కుటుంబము మంచి స్థితిలోనికి వచ్చుట కావశ్యకమగు నీతినియమములను పాటించుచు యితరులచే పాటింపచేయుట మొదలగు బాధ్యతలు కుటుంబయజమానియందు గలవు.

2. కుటుంబము మంచి స్థితిలోనికి వచ్చుటకు కటుంబస్థులెట్లు నడచుకొనవలెను ?

జ. ఎవరిపనులను వారు మనఃపూర్వకముగ నిర్వర్తించుచు, ఒండొరులు కలహించుకొనుటమాని, ఐకమత్యముగానుండి, గృహయజమానులయెడల భక్తి, విశ్వాసము లుంచినచో కుటుంబము మంచి స్థితిలోనికి వచ్చును.

3. పాఠశాలాభివృద్ధికై విద్యార్థులెట్లు తోడ్పడవలెను ?

జ. విద్యార్థులు పరస్పరానురాగము గలవారై, ఐకమత్యముగానుండి, ఎవరి పనులను వారు భక్తి, శ్రద్ధ, ఉత్సాహములతో నెరవేర్చుచు, పాఠశాల యజమానియు, విద్యార్థుల భావి అభివృద్ధికి కారణభూతుడునగు ఉపాధ్యాయుని ఆజ్ఞలకు లోబడి ప్రవర్తించినచో పాఠశాల యభివృద్ధి చెందును.

4. కొన్ని పారిశుద్ధ్య సూత్రములను పేర్కొని వాటిని విద్యార్థు లాచరించుటవలన గల లాభములను వివరింపుము ?

జ. చింకి గుడ్డలను, కాగితపు ముక్కలను ప్రతిచోటను పారవేయక వాటికై నియమించబడిన స్థానములో వేయవలెను. రోడ్లపై కన్పించు రాళ్లను, గాజుపెంకులను, ముండ్లను, పండ్ల తొక్కలను తీసి దూరముగా పారవేయవలెను. ప్రతిచోటను అసహ్యాకరమగు పనులనగా చీదుట, ఉమ్మియుట, మలమూత్రములు విసర్జించుట చేయకూడదు. పలకలను, పుస్తకములను మురికిగా నుంచరాదు. పాఠశాలయందును, ఆవరణయందును, గృహములయందును, మురికి లేకుండ నుండవలెను.

యిట్టి పారిశుద్ధ్య సూత్రములను విద్యార్థులు నేర్చుకొని యింటివద్దను, బడియందును, ఆటస్థలముల యందును ఆచరణలో బెట్టినచో గ్రామస్తుల కాదర్శప్రాయులగుదురు.

5. ఆరోగ్యమనగానేమి ? కొన్ని ఆరోగ్యసూత్రములను పేర్కొనుము ?

జ. దేహమందలి అవయవము లన్నియు తమ తమ పనులను ఎట్టి ఆటంకము లేక జరుపుకొనుచుండినచో అదియే ఆరోగ్యమని చెప్పవచ్చును.

ఆరోగ్యసూత్రములు:—మంచి ఆహారమును తినవలెను. మంచినీటిని త్రాగవలెను శరీరమును, దుస్తులును, యింటిని శుభ్రముగా నుంచుకొనవలెను. శరీరవ్యాయామము చేయవలెను. దేహమునకు విశ్రాంతి యొసంగుచుండవలెను.

6. ఎట్టి ఆహారమును భుజించవలెను ?

జ. పుష్టికరమగునట్టియు, పరిశుభ్రమగునట్టియు, ఆరోగ్యకరమగునట్టియు, ఆహారమును భుజించవలెను.

7. ఆరోగ్యజీవనమున కవలంబింపవలసిన ఆహారనియమము లేవి ?

జ. నియమితకాలములయందు హితమగు పదార్థమును మితముగ భుజించుచు, నీటిని బాగుగా త్రాగవలెను. ఆకలిలేనప్పుడు భుజించరాదు. భోజన సమయములయందత్యుత్సాహముగ నుండవలెను. అనారోగ్యము కలుగజేయు కాఫీ తేనీరు వాడుట మాని, పాలు, మజ్జిగ ఎక్కువగా నుపయోగించవలెను. ఎక్కువ కారము, పులుపు శరీరమునకు మంచిదికాదు.

8 త్రాగుటకు వలయు నీరెచ్చటనుండి సాధారణముగా లభించును ?

జ. నదులు, చెరువులు, బావులు, గెడ్డలు, నూతులు మొదలగు వాటినుండి త్రాగుటకు నీరు లభించును.

9. నీటిని పానయోగ్యముగ జేయుటెట్లు ?

జ. జలాశయములోనికి మురికి చేరకుండ జాగ్రత్త పెట్టుటయు, నీటిని కాచి, చల్లార్చి, వడపోసియు త్రాగవలెను.

10. దుర్వాయువును పీల్చుటలో గల నష్టము లేవి ?

జ. చెడుగాలిని పీల్చినచో అనారోగ్యము కల్గుటయు, శరీరము యొక్కయు బుద్ధి, యొక్కయు బలము క్షీణించును.

11. గాలి ఎట్లు చెడును ?

జ. గాలిని పీల్చి విడుచుట వలనను, మలమూత్రములు కుళ్లిన పదార్థములు, మృతకళేబరములు నిలువయుండుట వలనను, దీపములు మొదలగునవి వెలుగుట వలనను గాలి చెడును.

12. మంచిగాలిని పీల్చుట వలఁ గల్గు లాభము లేవి ?

జ. మంచిగాలిని నిత్యము పీల్చుట వలన ఉత్సాహము, జీవితకాలము ఆరోగ్యము హెచ్చి మన నిత్యకృత్యములు బాగుగ చేసికొన గల్గుదుము.

---

# హి త బో ధ

రావెల వేంకట సుబ్బారావు

రాత్రులందు దిరుగ । రాదెప్పుడైనను
పురుగుబుట్ర లవని । దిరుగుచుండు
కాలకర్మ వశత । కాలికి తగిలిన
బాధ గల్గు నొకటఁ । బ్రాణమెగురు.

వెలుగు గలిగెనంచు । వెలుపలి కేగుట
రాత్రులందు పనికి । రాదు; దాన
నిలుగు లలముకొనును । చిత్తము చెడిపోవు;
పగటి పనులు భంగ । పడును నిజము.

లక్ష్యమునుంచి పెద్ద । లను గౌరవించిన
సుగుణుడంచు జనులు । పొగడుచుంద్రు;
కలుగు దానమేలు । కాదని చరియింప
దుష్టుడనుచు జనులు । దూరుచుంద్రు.

వెండికొండ నుండు । వేలుపు వారేమి
వీధి నెగురుచుండు । వెట్టులేమి

కర్మగతిని దప్పగలుగుదురే భువి ?
నేది యెట్టులగునె । యెవరికెరుక
కలిమి గల్గెనంచు । కన్నుమిన్గానక
బీద జనుల బాధ । బెట్ట తగదు,
కలిమి లేములవని । కలకాలముండవు
నిలిచియుండుఁ గీర్తి । నింద లెపుడు.
టక్కులాడొనర్చు । టాటోటులందున
లభ్యమైన ధనము । లక్షలైన
కూలినాలిచేసి । కూడబెట్టిన దాని
కన్న సౌఖ్యమీయఁ । గలదె భువిని.
సుఖములందు నాఁడు శుద్ధ స్వరూపుని
మఱచి దుఃఖసమయ । మందు తలప
నగునె ? సతము భక్తి । దగిలి స్మరించిన
వరదుఁడీడె కోరు । వరములవని
బాసలెన్నొ పల్కి । పరమేశు పేరిట
పాడుపొట్టనింపు । పథమువిడిచి
కాయకష్ట మొనరగా । జేసి లభ్యమౌఁ
దానఁ దృప్తిఁజెంద । దగును భువిని.
రాజరాజులైన । రంగప్పలైనను
మెతుకుదినక బసిడి । మెక్కగలరె
కలిమి గలిగినంత । కాటికి బోకుండ
సతము భూమిమీఁద । బ్రతుకగలరె.
దేవుఁడొక్కఁడనుచుఁ । దెలియంగ నగు నిల
మతము లొక్కటనుచు । మనగనగును;
కానిపోని తగవు । గల్పించుకొననేల
మరణమందనేల । మనుజులార!

---

# వత్సలామోదము

( పసుపులేటి రామకోటయ్య )

ఒక వూళ్లో ఒక అబ్బాయివుండేవాడు. ఆవూరిపేరు నిదానముగా చెప్తాను. ఆపిల్ల వానికి ఎనిమిది సంవత్సరాల ప్రాయము వుండేది. తోడిబాలురతో నాటలాడుతూ దారినిపొయ్యే పెద్దవారిని చూస్తే నమస్కారము చేయడం, వారివెంట కొంత

దూరము పోవడం మళ్లీ యింటికి తిర్గి రావడం ఆపిల్లవాని పని.

కొన్నాళ్ళయిన తర్వాత ఆపిల్లవాడు ఆటలు మానేశాడు. పాటలు మానేశు. తల్లి కోపపడిన పిల్లవాని మాదిరి ఒక్కచోటునే కూర్చుండేవాడు. జిజ్ఞాసతో సన్యాసులు కనబడితే చాలు యెగాదిగా చూస్తుండేవాడు. అందరు యీపిల్లవానిని పిచ్చి పట్టినవానిగా తలంచే వాళ్లు.

ఒకరోజు ఒక సన్యాసి యేవూరినుండి వచ్చాడో తెలియదు పొడుగాటి జడలు, మాసిపోయిన బట్టలు, కమండలముచేంబూని ఆయబ్బాయి వున్న వీధిలో పోతున్నాడు. ఈ పిల్లవాడు అలవాటు ప్రకారం ఆ సాదుగారిని యేకంగా చూస్తున్నాడు ఆశ్చర్యముతో. ఆయనకూడా పిల్లవాని ముఖంవంకే పరకాయించి చూస్తూ నిలబడ్డాడు. దారినిపోయే వాడల్లా, పిల్లవాని చెలికాండ్రు వాని చేతులను పట్టుకొని ఆటలోనికి లాక్కెళ్లారు . ఆకుర్రని మనస్సు ఆటలమీద యుంటేగా ? వెంటనే యింట్లోకి పరుగెత్తాడు. అమ్మ యెదురుగ వచ్చింది: 'ఏమిరా! నాయనా పరుగెత్తుకొని వచ్చావు, పిల్లలేమైన కొట్టినారా నిన్ను' అని బుజ్జగించింది.

మరచాను బైరాగిసంగతి చెప్పను. ఆయన చక్కావెళ్లి ఆవీధిలో యున్న పెద్దయురుగు చుట్టూ వేయబడియున్న మట్టిచెట్టుక్రింద కూర్చున్నాడు. ఆవీధిలోని వారంతా సాదుగారువచ్చారు జ్యోతిషము చెప్పించుకొందామని ఆ సన్యాసిచుట్టూ మూగారు. ఆ సాదుగారి ముఖమందున్న తేజస్సు వారందఱిని ఆకర్షించింది. ఆజడదారి రెండుగంటలకాలము కళ్లు మూసికొని తర్వాతనిత్యజపములోంచికళ్లు తెఱచి అందరిని చూచాడు ప్రేమచూపులతో. కొందఱు యీయనకు కానుకలను సమర్పించారు కొందఱు పండ్లు తెచ్చియిచ్చారు. వచ్చినవాళ్ళకు కొన్ని నీతులను వుపదేశించడం మొదలు పెట్టారు సాదుగారు.

మనం యెవరిని గుఱించి తెలుసుకుంటున్నామో ఆపిల్లవాడుకూడ తన తల్లినడిగి కొన్ని పాలు గ్లాసులో పుచ్చుకొని సాదుగారి వద్దకువచ్చి సమర్పించాడు. మిక్కిలి శ్రద్ధాభక్తులతో ఇది జరిగినది. ఒక సాయంకాలము కనుచీకటయింది. పిన్నలు పెద్దలు సాదుగారి వద్దనుండివెళ్ళిపోయినారు తమ తమ యిండ్లకు. ఈ పిల్లవాడు మాత్రము సాదుగారి వద్దనే కూర్చున్నాడు. చీకటి పడినప్పటికిని సాదుగారు పిల్లవానిని ఎవరి పిల్లవాడవు? ఎందుకు వచ్చావు, నాతో నీకేమిపని. పిల్లలైనవాళ్లు తోడిబాలురతో నాడుకొనుటేగాని నావంటిసన్యాసులతో ఏమిపని. వెళ్ళిపో" అనిఅన్నాడు. పిల్లవాడు నేలమీద సాదుగారిముందు బోర్లపడి దండముపెట్టి నిల్చొని చేతులు జోడించి యీవిధముగా చెప్పాడు. సాదుగారితో "అయ్యా యీ లోకాన్ని పుట్టించింది భగవంతుడంటారు. ఆయన యెట్లా వుండేది యెచ్చటుండేది మనకు తెలియదు. ఆయన మనందరికి ఒకరాత్రి ఒక పగలు దయచేసాడు. అట్లే మన జీవితములో మనకు క్షణ క్షణానికి సుఖ దుఃఖములను కూడ కలిగించాడు. వీటన్నిటిని తప్పించుకోవడము యెట్లు? అట్లే స్వర్గమునరకము కూడ వున్నదంటారు. శాశ్వతమైన స్థానము యేది? దానిని చేరుట యెలాగు దయచేసి చెప్పుమని కోరుతున్నాను. అవి

అడిగాడు బాలుడు. సాదుగారు "నీవు చిన్నవాడవే? కాని నీకో రెక్క నెరవేర్చు తాను. నీవు కోరుతున్నావు కాబట్టి. సరే కూర్చోమ"న్నాడు. పిల్లవానిని తనదగ్గ రికిరమ్మన్నాడు. చెవిలో నేదోవూదాడు. వెంటనే పిల్లవాని జ్ఞాననేత్రాలు తెరవ బడ్డవి. చాలసేపయింది అప్పటికి. ఆపిల్ల వాని తల్లిదండ్రులు 'అబ్బాయియేడం'టూ వూరంతా వెతికారు ఆ పిల్లవానికోఅకు. పిల్లవాడు కనుపించాడుకాడు. విసిగి యింటికొచ్చారు తల్లిదండ్రులు, భయం తోను, విచారంతోను. తోడిబాలుర నడి గారు. వారేమియు చెప్పలేకపొయ్యారు. ఇట్లా విచారిస్తుండగానే బాలుడు యింటి ముందటనే నడచి వస్తూ యున్నాడు. అందరికి చోద్యమైంది. పిల్లవానిని కౌగ లించుకొన్నారు. తల్లిదండ్రులు ప్రేమతోను ఆశ్చర్యము తోను. తండ్రి పిల్లవానిని 'ఎక్కడికెళ్ళావు' అని అడిగాడు. సాదు గారి వద్దకు వెళ్ళి వచ్చాను అనిఅన్నాడు. సరేననుకొని తండ్రి యీ రాత్రియంతయు వూరుకొని తెల్లవారుఝామువనే లేచి సాదుగారిని చూస్తామని ఆమఱ్ఱి వృక్షము వద్దకు వెళ్లాడు. సాదు పుంగవుడు కనిపిం చాడు కాడు. ఆయన చాలాచింతించాడు. కాని యేమిచేస్తాడు. ప్రాప్తములేదు. సాదు గారి దర్శనం ఆయనకు — — ఇంటికివచ్చి కుమారునికి చెప్పాడు యీసంగతి. మన పరిచయుడైన పిల్లవాడు చాల విచార పడ్డాడు. సాదుగారు యెప్పుడైనా కని పించలేదు ఆవూళ్లోమళ్లీ.

ఆవూరేదో చెప్పమంటారా? మన సత్తెనపల్లె. ఆ పిల్లవాడు దినదినము వయస్సుతోఁబాటు జ్ఞానముతోఁగూడ పెరి గాడు. చిన్నప్పటినుండి అనేక మహాత్మ్య ములు చేస్తూండేవాడు. వాటన్నిటిని చెప్పటకు నాకు సమయం చాలదు. ఒక్కటి మాత్రముచెప్తాను సావధానంగా వినండి.

పిల్లవాని మనస్సునంతోషపెట్టగలందు లకు పాతికసంవత్సరములు రాగానే వివా హం చేసారు తలిదండ్రులు ఒక రోజున ఆయన బజారులో సదిమందితోమాట్లా డుతూ వారుయీవిధముగావున్నట్లుండిపై నున్న గుడ్డతో తోలుతూ "అదిగో పెద్ద పులిషు" అని అంటూతోలారు వీధిలోనే అదరిపడి. బజారులో యున్న వారందరు భయపడినారు. వారికేమైనా పిచ్చి పట్టిం దని వారు సాధారణముగా దారిని వెళ్ళు తూ యెవరిని పలుకరించే వారు కారు. తలనుగూడ పైకెత్తే మానవుడు కాడు. కొందరు వీరి స్వభావాన్ని బట్టి పిచ్చివాడనియు, గర్వితుడనియు, పరమ భక్తుడనియు తలంచేవారు. అప్పుడే ఒక స్నేహితుడు "అదేమి? అట్లా అదలిం చావు వీధిలో" అని వారిని ప్రశ్నించగా యిట్లా చెప్పారు. వారు "మా ఆవులు గేదెలు గల మందలు ఒక అడవిలో మేయుచుండగాఒక పెద్దపులిపై బడవచ్చింది మందమీద. అందుకొఅక్కై నేను దానిని అదలించాను. అది వెళ్లిపోయింది. మంద కేమియు నష్టము కలుగలేదు" అని చెప్పారు. తర్వాత మూడు రోజులకు మందను తోలుకొని వచ్చిన గొల్లలు ఫలాని రోజున పెద్దపులి వచ్చిందని చెప్పారు. మందమీద పడకుండా పరు గెత్తింది. యెవరోపెద్దపులిని అదలించినట్లు అనియు చెప్పారు గొల్లలు.

ఇట్లా వారి జీవితములో చాలా చిత్రమైన మహాత్మ్యములుకనుపర్చారు. వారు పెద్దవారైనారు. శిష్యులు చాలమందియైనారు. వారి ముఖమే చెప్పుతుంది శాంత మూర్తియని. కవిత్వము చిన్నప్పటినుండి వుగ్గుబాలతో నూరి పోసింది వారి అమ్మగారు. చక్కని కవిత్వముతోను చక్కని రసముతోనుమిళితమైంది. అనేకతత్వాలు రచియించారు వేదాంత సారమంతయునొక పుస్తకము లోనిమిడ్చారు. దాని పేరుపరమానందసుధాలహరిస త్తెనపల్లి పురమునకు తూర్పుభాగమున నొక వృక్షముక్రింద శిష్యులతో కూర్చుని సాదుల సాంగత్యముతోను, భగవన్నామముతోను కాలం గడిపేవారు. దానినే యిప్పటికి మఠమందురు. ఆ మహాత్ముని పేరేదో చెప్పండి? వారే శ్రీ పుల హరి పీరోజీ ఋషీంద్రులు. మోక్షాన్ని స్థిరస్థానముగా చూరగొన్నారు. తన శిష్యులకు దారి చూపించారు మోక్షానికి.

ఇప్పటికి 52సంవత్సరములైంది వారు స్వర్గస్థులై. ప్రతిసంవత్సరము మ హా శి వ రాత్రికి ముందు వారి మఠానికి ఆరాధనకు పేరుతో భక్తులందరినిరప్పిస్తున్నారు ప్రభలతోను, మేళ తాళములతోను, భజనలతోను, సాదుల వేదాంత గోష్టితోను.

మనముం గూడ వారి మందిరమునకు వెళ్లి భక్తుల సహవాసముతో వేదాంత సారమును రు చి చూ చి భ క్తిమార్గమున శాశ్వతానంద పదవియైన మో క్షా న్ని సులభమార్గమున చేరగలందులకు ప్రయత్నించుదాము. పరమేశ్వరుడు మనలనందరిని కాపాడునుగాత !

---

# రవీంద్రునిస్మృతి

(స్వర్గీయుండైన శ్రీరవీంద్ర కవిచంద్రుని నిర్యాణమునుగూర్చి సంతాపమును వెలిబుచ్చుగీతము)

పసుపులేటి రామకోటయ్య

అయ్యోనిదిరించె ఠాగూరయ్యో నిదిరించె
అవనిలోకడుది నములు ఆంగ్లకవియై॥ అయ్యో॥

1. రవీంద్రనామమున కవీంద్రుడయ్యె
సర్వజాతీయుల సన్నుతిగాంచిన॥ అయ్యో॥

2. ఖండాంతరముల ఖ్యాతినిఁజెంది
పండితోత్తముల ప్రేమనుఁబొందిన॥ అయ్యో॥

3. ప్రపంచమంతట పారికెను కవనము
బెంగాలి భాషలోఁ నాంగ్లభాషలో॥ అయ్యో॥

4. భారతదేశమున! బ్రహ్మర్షియై
భారతమాతకు ప్రియముఁగూర్చిన॥ అయ్యో॥

5. భారతదేశమా భీతినొందకుమా
భారతీయులను పండితులఁజేయుము॥ అయ్యో॥
6. ఆంగ్లమందు నుత్కృష్టతనొంది
ఆంగ్లేయులచే కీర్తినిఁగాంచిన॥ అయ్యో॥
7. బెంగాలిదేశమా! బెంగ జెందకుమా
ప్రబలుచుండుము పెక్కురు కవులచే॥ అయ్యో॥
8. శాంతినికేతన ప్రశాంతితో నిల్పి
దేశశాంతికి త్రోవఁజూపిన॥ అయ్యో॥
9. పరమమార్గమున ప్రేమతో నడచి
స్థిరచిత్తముతో స్వర్గముఁజేరిన॥ అయ్యో॥

---

# భూలోకమున మోక్షదాయకమగు సప్తనగరములు.

(1) అయోధ్య:—ఇది సరయూనది తీరముననున్నది. కోసలదేశము దశరథుడు మొదలగు సూర్యవంశపు రాజులకు రాజధానిగా నుండెను.

(2) మధుర:—ఇది యమునానది తీరమున నుండు ఒక గొప్పపట్టణము. శ్రీకృష్ణుని జననస్థానము. కంసుడు ఈనగరమునకు రాజుగ నుండెను. ఈ నగర సమీపముననే గోకుల బృందావనములున్నవి.

N B. పాండ్యరాజ్యమునకు రాజధానిగనుండిన మధురవేరు ఇది వేరు.

(3) మాయ:—హరిద్వారమునకు పేరు.

(4) కాశి:—ఇది అందరికి తెలిసినదే!

(5) కాంచి!—ప్రస్తుతము దీనిని కంజీవరము అంటారు. చెంగల్పట్టు జిల్లాలోనిది.

(6) అవంతి:—(అవంతిక):—ఉజ్జయినికి నామాంతరము.

(7) ద్వారవతి:—(ద్వారక):—ఘూర్జర (గుజరాతి) దేశముననున్నది. ఇది శ్రీకృష్ణుని రాజధానిగ నుండెను. అనేక ద్వారములు కలిగియుండుట వలన దీని కీపేరు కలిగెను.

బోర్డు ప్రాథమికపాఠశాల,
గురమ్మపాలెము.
తేది 24—2—1942.

బలివాడ వెంకట సూర్యనారాయణ.

# భూగోళము - 4 వ తరగతి

(హిందూ దేశము......సింధు మైదానము

ఏలూరు వెంకటరమణమూర్తి

I సింధునది ప్రవహించు ప్రదేశము - దాని ఉపనదులు— హిమాలయము కుత్తరమున టిబెట్‌లోని మానస సరోవరమున పుట్టి హిందూదేశమునకు వాయవ్య భాగముగుండా కాశ్మీర్ దేశముమీదుగా పశ్చిమదిశగా ప్రవహించుచు అరేబియా సముద్రములో కరాచివద్ద కలియుచున్నది.

ఇందు 1 జీలం, 2 చీనాబ్, 3 రావి 4 బియాస్, 5 సట్లెజ్ అను 5 ఉపనదులు కలియుచు యీ మైదానమును ధనధాన్య సమృద్ధితో దులతూగునట్లు చేయుచున్నవి.

II సస్యాభివృద్ధికి కారణములు—పంచనదులు ప్రవహించుటచే యీ దేశము నకు పంచనదము లేక పంజాబ్ అను పేరువచ్చినది ఈ 5 ఉపనదులకు ఆనకట్టలు కట్టుటచే లక్షలకొలది ఎకరముల భూములు సస్యసమృద్ధిని కలిగియున్నవి.

సింధునదిపైన సక్కర్‌వద్ద ఆనకట్ట వుండుటచే సింధు మైదానమందు కూడ కాలువలు ఆధారముతో వ్యవసాయములు బాగుగా పైరగుచు ధనవంతమైన ప్రదేశ ములుగా పేరొందినవి.

III ఈ ప్రాంతపు ప్రదేశములలోని పంటలు: పంజాబ్‌లో గోధుమలు ముఖ్య పంట. ఇది ఐరోపాకు ఎగుమతి- ప్రత్తిశనగలు, బార్లీ, జొన్నలు, చెరకు ముఖ్యపంటలు. ఇంకను ఎత్తైన ప్రదేశములలో తేయాకు తోటలు గలవు. సాల్ట్ రేంజీ పర్వతములందు సైంధవలవణము (రాతి ఉప్పు)దొరకుచున్నది.

IV ఈ నదీప్రాంతపు పట్టణములు - వాటి పరిశ్రమలు—

1. పంజాబ్ అంతటను పిండిమరలు, ప్రత్తినుండి గింజలుతీయు మరలు, శాలువలు, కరబళ్ళు నేయుమరలు అనేకములు గలవు. పంజాబునకు లాహోరు రాజధాని.

2. అమృతసర్:—పూర్వము సిక్కులకు యాత్రస్థలము.

3. లయల్పూర్:—గోధుమ వర్తకమునకు కేంద్రస్థానము.

4. సిమ్లా:—ఎండాకాలపు ఆరోగ్యస్థానమై యున్నది.

5. హైదరాబాద్:—సింధు రాష్ట్రమునకు రాజధాని - ఈ పట్టణము సింధు నదిపై నున్నది. సక్కర్ ఆనకట్టవల్ల గోధుమ - ప్రత్తి విస్తారమైన పంటలు పండు చున్నవి. సింధుమైదానము ఇటీవల, నీటివసతులతోను, పరిశ్రమలతోను, పంటల తోను నిండిన ప్రాంతమగుటచే ధనధాన్యములతో దులతూగుచున్నది.

# సంఖ్యాస్థాన పథకము

| అంకెల సంఖ్య | తారతమ్యము | కోట్ల స్థానము | పదిలక్షల స్థానము | లక్షల స్థానము | పదివేల స్థానము | వేల స్థానము | వందల స్థానము | పదుల స్థానము | ఒకట్ల స్థానము | చదువు విధము. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఒకటి | మిక్కిలి చిన్నది | ... | ... | ... | ... | ... | ... | ... | 1 | 1 ఒక అంకెలో మిక్కిలి చిన్నది |
| ,, | మిక్కిలి పెద్దది | ... | ... | ... | ... | ... | ... | ... | 9 | 1 ఒక అంకెలో మిక్కిలి పెద్దది |
| రెండు | ,, చిన్నది | ... | ... | ... | ... | ... | ... | 1 | 0 | 2 రెండు అంకెలలో మిక్కిలి చిన్నది |
| ,, | ,, పెద్దది | ... | ... | ... | .. | ... | ... | 9 | 9 | 2 రెండు అంకెలలో మిక్కిలి పెద్దది |
| మూడు | ,, చిన్నది | ... | .. | .. | .. | ... | 1 | 0 | 0 | 3 మూడు అంకెలలో మిక్కిలి చిన్నది |
| ,, | ,, పెద్దది | ... | .. | ... | ... | ... | 9 | 9 | 9 | 3 మూడు అంకెలలో మిక్కిలి పెద్దది |
| నాలుగు | ,, చిన్నది | ... | ... | ... | ... | 1 | 0 | 0 | 0 | 4 నాలుగు అంకెలలో మిక్కిలి చిన్నది |
| ,, | ,, పెద్దది | ... | ... | ... | ... | 9 | 9 | 9 | 9 | 4 నాలుగు అంకెలలో మిక్కిలి పెద్దది |
| ఐదు | ,, చిన్నది | ... | .. | ... | 1 | 0 | 0 | 0 | 0 | 5 ఐదు అంకెలలో మిక్కిలి చిన్నది |
| ,, | ,, పెద్దది | ... | ... | ... | 9 | 9 | 9 | 9 | 9 | 5 ఐదు అంకెలలో మిక్కిలి పెద్దది |
| ఆరు | ,, చిన్నది | ... | .. | 1 | 0 | 0 | 0 | 0 | 0 | 6 ఆరు అంకెలలో మిక్కిలి చిన్నది |
| ,, | ,, పెద్దది | ... | ... | 9 | 9 | 9 | 9 | 9 | 9 | 6 ఆరు అంకెలలో మిక్కిలి పెద్దది |
| ఏడు | ,, చిన్నది | ... | 1 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 7 ఏడు అంకెలలో మిక్కిలి చిన్నది |
| ,, | ,, పెద్దది | ... | 9 | 9 | 9 | 9 | 9 | 9 | 9 | 7 ఏడు అంకెలలో మిక్కిలి పెద్దది |
| ఎనిమిది | ,, చిన్నది | 1 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 8 ఎనిమిది అంకెలలో మిక్కిలి చిన్నది |
| ,, | ,, పెద్దది | 9 | 9 | 9 | 9 | 9 | 9 | 9 | 9 | 8 ఎనిమిది అంకెలలో మిక్కిలి పెద్దది. |

బోర్డు ప్రాథమిక పాఠశాల, గురమ్మపాలెం,
24—2—1942.

బలివాడ వెంకటసూర్యనారాయణ

# ఉపాధ్యాయుల మొర

సోదర సోదరీమణులారా !

నా సోదరులు యింతవరకునూ ఉపాధ్యాయుల కష్టములగూర్చి విపులముగా వ్యాసరూపమున లోకమునకు వెల్లడి చేయుచునే యున్నారు. అందు నే పరిశీలించి నంతవరకు సాధారణ లోపములనే గుర్తించుచున్నారు. గాని ప్రస్తుత స్థితి తొలగించు నుపాయము నాలోచించకున్నారు. ఈ వ్యాసమునందు నేను స్టాట్యూటరీ కట్టును గూర్చి మాట్లాడుచున్నాను. కాన సావధానముగా చిత్తగింపుడు. 1 వ తరగతిలో $\frac{1}{4}$ వంతు 4, 5 తరగతులలో లేనప్పుడు 15% గ్రాంటు తగ్గింపబడునని ప్రభుత్వమువారు యిదివరకే ఒక నిబంధనను అమలుపరచినారు. ఆ సంగతి నా సోదరులందరకునూ తెలిసి యున్నదే! అట్టి లోపములేకుండ సాధ్యమైనంతవరకూ నిష్పత్తి సరిపుచ్చుచునే వచ్చుచుంటిమి.

గత 1941 సంవత్సరం జనవరి మొదలు జూన్ నెలాఖరు వరకు జరిగిన సాలుసరి పరీక్షలు క్రమముగా జరిగినవి. వాటికి ఏ విఘాతము రాలేదు. అదేవిధముగా వచ్చుచు జూలై మొదలు డిశంబరులోగా పరీక్షింపబడు గ్రాంటు పాఠశాలలకు బాలికా సమస్య యొకటి తాండవమాడినది. గ్రామ బాలికా జనాభాలో $\frac{1}{4}$ వ వంతు బడిలో చేర్చకున్న బడి రికగ్నిషను తొలగించెదమని దొరతనమువారు ఉత్తరవు జారీచేయించినారు. ఆ యుత్తరువు ప్రకారము 1 వ తరగతిలో క్రొత్తగా చేర్చబడిన బాలికల సంఖ్యచే 4, 5 తరగతుల నిష్పత్తి చాలినదికాదు. ఇందు విషయములో జిల్లా విద్యాశాఖాధికారులు కొంచెమయిననూ ఆలోచింపక పూర్వపు రూలుప్రకారం అంతకు ముందు ప్రపోర్షను సరిగా నున్నప్పటికి 15% గ్రాంటు తగ్గించిరి. ఇది కేవలము అన్యాయమే! కొందరికి రొట్టెలు కొందరికి ముక్కలు పంచిన విధముగా నున్నది. కాని ప్రభుత్వమువారి సమదృష్టియందు వెల్లడికాలేదు. మరియును సదరు $\frac{1}{4}$ బాలికలను చేర్చు విధానము స్థానికపారశాలల వారికి 1942 సంవత్సరము వరకు పొడిగించుటయు, ఎయిడెడ్ స్కూళ్లకు వెంటనే అమలు పరచుటయు, తన్మూలమున 15% గ్రాంటు తగ్గించుటయు, చూడ విద్యాధికారులు న్యాయమెంతవరకు గలదో అందరికిని తెలియగలదు. ఒకరూలు అమలుపరచునపుడు దానివల్ల లాభనష్టములు అందరికిని సమానముగా పంచిపెట్టవలెనే కాని మొదటి ఆరునెలల వారికి లాభమున్నూ రెండవ ఆరునెలల వారికి నష్టమున్నూ కలుగచేయుట కేవలము నిందాస్పదము గాని వేరొకటికాదు. కాబట్టి ప్రభుత్వమువారు యిప్పుడయినను ఇందు విషయమై న్యాయదృష్టితో ఆలోచించి బాలికలను చేర్చినందువల్ల కలిగిన స్టాట్యూటరీకట్టు ఏయే పారశాలలకు సంభవించినదో కనిపెట్టి అట్లు కొట్టివేసిన 15% గ్రాంటుకూడ తిరిగి యిచ్చివేయబడునని త్వరలో ఆర్డర్లు దయచేయించవలసినదిగా నాసోదర సోదరీ మణులందఱిని నాతోపాటు మొరపెట్టి తగినంత ఆందోళన సల్పగలందులకు ప్రార్థించుచున్నాను.

ఇట్లు విధేయుడు,

పాంగ్రంగి సూర్యనారాయణ

మేనేజరు :

గడ్డకంచరాం - చీపురుపల్లి రేంజి

# Air Raid Precautions & Civilian Duties
# విమానదాడి హెచ్చరికలు - పురజనులు

A G. ISRAEL, A R P First Aid Party, Vizag.

[ వరుస - ఎత్తండి మనగెల్పు జండా ]

ఎరుగండి - A R P విధులు - వాటి నెఱిగి యున్నముప్పు - దరిఁచేరదని నమ్మి॥
A R P యనగాదు - వెఱ్ఱిప్రయత్నంబు - స్వరక్షణకు - మార్గమండి
శత్రు - వైమానములదాడి నుండి - వాటి - నెరిగిన చాలా మేలండి
ముప్పు - తప్పదు తూలిననుండు - మీదు దరివారికతిఁ దెలియండి
వారు - నిరసించిరి A R P నండి-శ్రీదొరతనము-మన మేలుకోరి తెచ్చారండి

## 1

ముందు సూచనలు విమానదాడుల నెరిగి - అందరికిని దెల్పనండి
సందు - సందుల్లసైరనులండి - వాటి సందడి పై దాగనండి
భూ - గర్భానవసతి ఇండ్లండి వంద - లాదిగ కందకలండి
ఇంక - నరికట్టకేడు లనండి - ఏ. ఆర్. పి. వార్డను పోస్టులండి
ఫస్టెయిడు - పార్టీపోస్టులండి - రెస్క్యూ పార్టీఫైరు సెంటర్లండి
ఉంచి పలుచోట్ల పురముననండి - సిటీ కంట్రోలు సెంటరునకండి
టెలీ - ఫోనుల మూలముగనండి - కేంద్ర పర్చియు పై పోస్టులండి
మొదడునాడు ౨ పోలికనండి - పాటు పడఁజేసి పుర మేలుకండి
చేసి పురవీధులు బ్లాకౌటండి - సలిపి మరివెన్నో ఏర్పాటులండి
తెక్కల క్రింద పిల్లల గ్రద్దనుండి - దాచు తల్లికోడి చందమండి
అందంద బందోబస్తు - జేసె దొరతనమండి.

## 2

సైరన్ వినినంతటనే - శరణాలయమున మరి కందకాలకు జేరుకోండి
భద్ర పర్చియునందు నీరండి - సూరపర్చండి దీపంబులండి
క్రొవ్వు వత్తులు కిరోసీను లండి - వలదు వ్యాయామపనులందు నండి
ప్రాణవాయువు హరియించియండి - అవియె ప్రాణహానిఁ దెచ్చునండి
టార్చి లైట్లు అందు తగిన వండి - కాక శరణాలయంబులనండి
వేరు - తావుల మీరున్ననండి - చేరువ భవనాల తలదాచుకోండి
బల్ల మంచాలక్రింద నణగండి - మెట్ల వంతెనలక్రింద కూర్చోండి
వింత జూడ పంచల జేరకండి
దూర బయలైన బోర్లఁబండండి - పండ్ల - నేదేని కఱచియుంచండి
చెవుల దూదిజొనపిన మంచిదండి - నోరు తెఱచిన శ్వాసకు మేలండి

దాడి దాటినదని సైరనండి - ఇచ్చు వరకు నెటుకదలకండి
లేదా గురి యయ్యెదరు బాంబు - గుండ్ల దెబ్బలకండి॥

**3**

బాంబులలోన గలవు - పెక్కురకములండి పరికించెదము వరుసనండి
అందు మొదటిది ప్రేలుడు బాంబులండి - ఐదు వందల పౌన్లబరువండి
అంటి యుండు వాటికి ఫ్యూజులండి - బాంబు ప్రేలవలసిన సమయమండి
ఆధారపడియుండు ఫ్యూజుపైనండి - జాగు జేసి ప్రేలు బాంబులండి
నలుభై యడుగుల లోతునకండి - భూమి జొరచుకొని పోయియుండి
ప్రేలి కలిగించు భూకంపమండి - యాభై యడుగులలోపుననండి
పెల్లగింపబడు పునాదులండి - దాని వారింప నశక్యమండి
సలిపి యత్నములు మేధావులండి - విఫలులైరి ఇంగ్లాండులోనండి
పారి పోవుటే అట్టి తరినండి - గాక వేరుమార్గములేదు సుండి
నేల ప్రేలు బాంబులైన నండి - బాంబు ప్రేలిన మరుక్షణమేనండి
అగును వేలకొద్దితునకలండి - అంగుళకై వారమునను నండి
రైఫిలు గుండు వేగంబునకండి - వాటి వేగంబు రెట్టింపునుండి
విజ్వ మని ఎగిరి నలుదిశల కండి - యాభై యడుగుల దూరంబుకండి
చేయు తుత్తునియలు అడ్డులండి - బల పర్చండి గోడలనండి
కలవు దొంగప్రేలుడు బాంబులండి - ప్రేలు తెలియని రీతినేనండి
బాబు దరిజేరకండియే - ప్రేలని బాంబుకండి

**4**

పౌరుషము చూపుటయందు పై బాంబు - లకు మిన్న బ్లాస్టు యనేది సుమ్మండి
గాలిఫోర్సే -యది బాంబునుండి - ఐనా కూలద్రోయును కొంపలండి
ఇటుక గోడలు ముక్కలగునండి - గాజ అద్దాలచోద్యమేమండి
ఎగిరి మిమ్ముగాయుల, జేయునండి - ముప్పు దెచ్చును మీ గృహములండి
పెరికి వేయండి అద్దాలనండి - లేదా అంటండి జిగురుతోనండి
తలుపు కిటికీల అద్దాలకండి - క్యాలికో గుడ్డమరి కాగితాలండి
మస్లిన్ గుడ్డ మరి శ్రేష్ఠమండి - అర్ధ అంగుళ అల్లికనండి
తీగె అభ్రక అద్దాలునండి - లోన ప్రక్కలం జేర్చి కొట్టండి
శ్రద్ధ పూనండి ఈక్షణమేనండి - గోడగా పాడుటకు బ్లాస్టునుండి
మట్టి నింపిన పెట్టెలనండి - గోడపట్టులం జేర్చి పెట్టండి
ఇసుక - బస్తాలనైనా పేర్చండి - ఉక్కు రేకులు మరి కంకరండి
సిమ్మెంట్ - బలకరము గోడలకండి - వలను అభిముఖపు గుమ్మాలునుండి
మరియు అభిముఖపు కిటికీలునండి - మార్చి మదుగు గోడలనెత్తుకొండి
మీదు గుమ్మాల కెదురుగనండి - బాబు మేల్కొండి ఏ.ఆర్.పి. సలహాలచేకొండి॥

## 5

మరిభయంకరములు - మంటలబాంబులు ఎరుగండి - వివరముగనండి
అవియె - వైరులు విస్తారమండి - వాడు - ఆయుధములుగదండి
బరువు - రెండుంబావుపౌన్లేనండి - వేల - కొద్దిగయొక బాంబరఁడి
మోసి - కొనిపోయిచేయనగునండి - వేల - మంటలుక్షణములోనండి
నీటి - మూలములఁ జెడగొట్టియండి రహ - దారుల రస్తాలనండి
చెరచి - అరికట్టి రవాణనండి - అలజడి - కలిగించు జనులలోనండి
ఓడ - రేవులమరిస్టేషనులండి - మరియు - మిలిటరీ సెంటర్లనండి
యుద్ధ - పరికరయంత్రాలునండి - తేల - స్థలనిర్ణయముచేయనండి
సాయ - పడుటే అసలువత్తండి మిగుల - బలముతో ఈబాంబులండి
దూసి - కప్పుల బడుక్రిందనండి క్రింద - బడిన క్షణములోనేనండి
చాల - దూరంబు నలుదిశలకండి టపటప - మంటుజిమ్మును మంటలండి
దూర - పర్చండి కర్రసరుకండి మీదు - అటుకలకప్పులనుండి
మంట - సోకనీయని పెయింటులండి కలవు - అంటండి వాసాలకండి
కప్పుపై - ఇసుకకప్పిన మంచిదండి అదియె - విరుగుడు ఈబాంబుకండి
నీరు - ఆర్పెడిబాంబులకండి వలదు - బాల్చీలు గొట్టాలునుండి
తీవ్ర - రూపంబుదాల్చు సుమ్మండి స్టిరప్ - పంపులు మంచివేనండి
నీరు - ఆర్పని బాంబులకండి ఇసుక - బస్తాలు మంచివేనండి
అగ్ని - జ్వాలరంగునుబట్టియండి బాంబు - రకములు తెలియనగునండి
బాబు - A R P చేరండి - సలహాలచేకొండి.

## 6

విషవాయువులు శత్రు - విమానములువాడు దివ్యాయుధము సుమ్మండి
జర్మను - తెచ్చె మొదట దీనినండి దాని - వల్లకీడులుఁ దెలిసికొండి
కొన్ని - ఊపిరితిత్తులనండి చెరచి - శ్వాసకార్యము నిల్పునండి
కొన్ని - శ్వాసావయవములకండి నొప్పి - బాధఁగలిగించు మెండండి
బాంబు - ప్రేలినక్షణములోనండి కొన్ని - కన్నీరుకార్పించునండి
బ్లిస్టరు - గాలులు మరిచెడ్డవండి కంద - జేసినందులేకనండి
పొక్కు - లెత్తఁజేయును దేహమండి ఊపిరి - తిత్తులమరికండ్లకండి
అవి - బహుభయంకరము దెలియండి మీదు - వస్త్రాలనంటు ముందండి
విషగాలి - సోకినక్షణమే సుమ్మండి పొండి - క్లెన్సింగు సెంటరులకండి
శుద్ధి - చేయునచట మిమ్మునండి రెస్పి - రేటరువిషగాలినుండి
కాచు - కవచము అదిశ్రేష్ఠమండి శుద్ధి , చేయుటకుగాలినండి
వేరు - సెంటర్లుఁగూడ గలవండి అవియు - దొరతనము పెట్టినవండి
బాబు A R P నడిగియా - సెంటర్ల నెరుగండి

**7**

యుద్ధచరిత్రంబు - విడ్డోరంబేనండి – మూలమెరిగిన మంచిదండి
భూచక్ర – మధ్యగలదు యూరఫండి అది – గుండెలాంటిది భూమికండి
దాని – శాంతియెలోకశాంతండి - దాని జబ్బేలోకముకు దెబ్బండి
అందు -పోట్లఎద్దు జర్మనండి మహా – యుద్ధము ముగిసినపుడండి
ఆంగ్లేయ - యుద్ధనైపుణ్యం గదండి విఱిచె - దానికొమ్ము మొదటికండి
కాని - పెరిగియు పదిఏండ్లకండి చిచ్చు - బెట్టుచు జనస్వేచ్ఛకండి
చిమ్మ – సాగిపోలెండు హాలెండు ఆస్ట్రియాది అల్పగోవులనండి
అరికట్ట - బ్రిటను ప్రభువులండి బద్ధ – కంకణమును గట్టిరండి
దిగెను - ఒక్కొక్కటిగ మిగతవండి – అన్నిలోకమందలి రాజ్యాలండి
మన - బ్రిటన్లకు విజయమండి కల్లు - గాకంచు ప్రార్థింతమండి
జయము – ఆధారపడి యున్నదండి మన భారతీయులపై గదండి
శక్తి – ధనమువ్యక్తుల పూర్వమండి లెండు - చేతామండి సాయమండి
బాబు - A R P చేరండి - జనసేవచేయండి

సమాప్తము

---

# మన మెక్కడున్నామో తెలిసికో !

[ పి. నారాయణయ్య - మేర్లపాక. ]

మన ప్రభుత్వము, మన రాజకీయ నాయకులు, దేశాభిమానులు, విద్యావేత్తలు ఈక్రింద గనబరచుకొన్న నాగరక దేశాలను పరికించితే ఎందుకవి మనకంటే ఎక్కువ నాగరికతను అనుభవిస్తూండేది తెలిసికోవచ్చు.

| ప్రాథమికవిద్యకు గౌరవమిచ్చి గమనించిన నాగరిక దేశములు | ప్రా॥ విద్యకు సుమారు యీ క్రింది సం॥లో గౌరవము గల్గినది. | ప్రాథమికవిద్యకు గౌరవమిచ్చి గమనించిన నాగరిక దేశములు. | ప్రా॥ విద్యకు సుమారు యీ క్రింది సం॥లో గౌరవము గల్గినది. |
|---|---|---|---|
| అమెరికా సం. రా. | 1900 | ఫ్రాన్సు | 1856 |
| ఆస్ట్రేలియా | 1901 | రష్యా | 1907 |
| ఇంగ్లాండు | 1872 | జర్మనీ | 1900 |
| కెనడా | 1906 | ఇటలీ | 1905 |
| ఐర్లండు | 1880 | జపాన్ | 1900 |
| డెన్మార్కు | 1814 | అబిసీనియా | 1907 |

## ఇండియాలో

ఇంతత్వరగా అనగా 1942 లోనే, ప్రాథమికవిద్యకు నిర్బంధం యెందుకు ? యింకా దినాలు జరగనీ అంటాడు మనము మెచ్చుకోతగిన రాచకీయ వేత్తలలో మేటియైన సత్యమూర్తి అవరగళ్. ఇప్పుడైన మనమెంత వెనకున్నామో తెలిసికొని నిద్రలేస్తే అన్ని పరిస్థితులు బాగుపడతాయి. (మి. ఈ)

---

## మొర

అఫిషి యేటింగు మహాప్రభూ !

తప్పులుబట్టి తిట్టేదే మీరు. నేర్చుకోవలసిన ట్రెయినింగయి యుంటే, కూటికి కఱవయిన పంతుళ్ళకడుపు గొట్టేదే మీరు. సంపాదించవలసిన క్వాలిఫీకేష నయి యుంటే; సెహభాష్ ! సమ్మతించాము. మీ భావి యధికారనిర్వహణ నైపుణ్యము బాగుంటుంది. కాని యదిగాదేమటి ! మీరు విద్యోద్ధారకులుగదా కాబోవునది ? విద్యోద్ధరణకు కావలసిన విషయాలను తమ ఆకస్మిక ఆగమానాల్లో పంతుళ్ళ కెరిగించి వాటి సాధ్యాసాధ్యములను పరికించి, ఆచరించేటట్లు నచ్చజేస్తే అప్పుడేమీపావన ! ఎలిమెంటరీస్కూళ్ళు హంబక్ అనేవిషయం మీవంటివారికి చెప్పవలసిందా ! ఇప్పుడైన కనుగొన్నందుకు మాధన్యవాదములు ! మీరు జెప్పేమాటే పల్లెటూళ్ళలో ప్రజలంతా అనుకొంటూంటారు ! దానికి మూలంకనిపెట్టి వాళ్ళనోళ్ళు కట్టిపెట్టితే మీరు విద్యాధికారులేగాదు, గొప్ప విద్యాసంస్కర్తలుగూడాకాగలరు. దానికి ప్రయత్నించండిసార్ కోపపడక. —ఇతి సంజయువాచ

---

## దశావతారమూర్తి

శ్రీమాన్ కొ. వెంకట కృష్ణమాచార్యులు.

మత్స్యమై నీటిలో - మహిమతో జన్మించి
సోమకుఁజంపిన - చోద్యమూర్తి
కూర్మమై జలనిధిఁ గూర్మితో జనియించి
సురల రక్షించిన - సుభగచరిత!
సూకరంబై పుట్టి - భీకరంబుగ నా హి
రణ్యాక్షుఁ దునిమిన - రాక్షసారి !
నరహరిరూపు తో - ధర హిరణ్యాకశిపుఁ
జీల్చి చెండాడిన - చిత్రమూర్తి

వామనమూర్తివై - బలిచక్రవర్తిని
　　నణఁగఁద్రొక్కినయట్టి - యమల చరిత !
పరశురాముండవై - పరిపంథి రాజుల
　　ప్రాభవం బుడిపిన - పద్మనయన !
శ్రీరామమూర్తివై - సీతను పెండ్లాడి
　　పరశురాముని గొప్ప - భంగపరచి
వాలినిం దునిమాడి - వారధిం బంధించి
　　దనుజులం జంపిన - ధరణినాథ !
బలరామ మూర్తివై - హలముచే నసురుల
　　హింకమణంచిన - పంకజాక్ష !
బుద్ధుఁడవై పుట్టి - బోధించి తీవెగా
　　బౌద్ధమతంబును - సిద్ధ చరిత !
కలికి రూపుండవై - కలియుగంబున నీవు
　　పాపులఁ జంపుము - భక్తపోష !
శ్రీ దేవ దేవేశ ! శ్రీశుభ చారిత్ర !
　　కళ్యాణపురుష ! కమలనాభ !
శ్రీహరీ ! భక్తజనరక్షణ ! - చిద్విలాస !
ప్రేమపూరిత చిత్త ! యో - నామ రహిత !
కరుణ గనుమయ్య ! యోదేవ ! - కరములెత్తి
త్వత్పదాళిఁ గొల్తు దశావ - తారమూర్తి ॥

---

# హర్షవర్ధనుడు

(వేదుల సూర్యనారాయణశాస్త్రి)

ఈ మహాశయుడు క్రీ. శ. ఏడవ శతాబ్దమునందు ఉత్తర హిందూస్థామునందు రాజ్యము పాలించెను. ఈతడు బంగాళ, మాళవ దేశములను జయించెను. ఈతని రాజ్యమునకు ముఖ్యపట్టణము కనూజ్.

ఈతడు ఉత్తర హిందూస్థానమున రాజ్యము చేయుచుండగా దక్షిణఇండియా యందు చాళుక్యులు అనునొక తెగవారు పాలించుచుండిరి.

హర్షుని రాజ్యపాలన:—తన ప్రజలను ఎక్కువ ఆదరముతోను, అనురాగముతోను పాలించెను. స్వయముగా ఆయా గ్రామములకు బోయి ప్రభుత్వము క్రమానుసరణిని జరుగుచున్నదో లేదో గమనించుచుండెడివాడు. కావున ప్రజలందరును సుఖముగా జీవించుచుండిరి.

సుగుణములు:—ఈతడు కొందరు రాజులవలె ఇతరమతములయందు అసహ

నములేనివాడు. అన్ని మతములను సమానముగానే చూచెను. ఈతడు మాత్రము బౌద్ధమతావలంబకుడు.

విద్యాభివృద్ధి:—హర్షవర్ధనుడు సారస్వతాభివృద్ధియందు మిక్కుటమగు నాశక్తిగల ప్రభువు. చాలమంది విద్వాంసులను, పండితులను పోషించెను. స్వయముగా తాను నాగావళి, రత్నావళి, ప్రియదర్శిక అనునాటకములు రచియించి పండితుడనే ప్రఖ్యాతి బొందెను.

మతాభిమానము విద్వత్పరిషత్తులు:—యీతడు బౌద్ధమతస్థుడే యయ్యెను, అన్ని మతముల వారిని ద్వేష్యభావముతో చూడలేదు. యీతడు ఒక సమయమందు కనూజ్‌లో ఒకపరిషత్తు నేర్పాటుచేసెను. అందుకు అనేకమంది పండితులును, అనేకవేలమంది జనులు వచ్చిరి. ఆసమయమున యీతడు చాల బంగారముతో బుద్ధుని విగ్రహము నొకదానిని చేయించి ఉత్సవముతో యొకమఠమునందు స్థాపించెను. 75 దినములు ఉత్సవములు చేయించెను. ఆ ఉత్సవకాలమందు హర్షవర్ధనుడే ధ్వజమును మోయుచుండెడివాడు. బుద్ధునిమీద యీతనికి భక్తి విశేషము.

మరికొన్ని దినములకు ప్రయాగయందు మరియొక సభచేయించెను. దానితోపాటు ఉత్సవము గూడ జరిపించెను. తన సొమ్ము అంతయును రత్నములు, బంగారము మొదలగువానిని బీదలకు భక్తులకును విరివిగా పంచిపెట్టెను. ఈ ఉత్సవము 5 సం॥ కొకపర్యాయమిట్లే జరిగించెడివాడు. విద్వద్గోష్ఠులు, శాస్త్రవాదములు, చర్చలు, మతములను గురించిన వాదోపవాదములు, సిద్ధాంతములు చేయుచు ఆయా పండితులతో మహానందముగా జరిపించెడివాడు. మొదటి దినమున బుద్ధవిగ్రహము, రెండవ దినమున సూర్యుని విగ్రహమును, మూడవ దినమున శివుని విగ్రహము స్థాపించెను. ఈతనికి మతద్వేషమున్నచో నిట్లు చేయునా? బౌద్ధబాటసారి హియాన్‌సాన్ అను చీనాదేశ యాత్రికుడొకడు యీతనికాలమున హర్షరాజ్యమునకు వచ్చి హర్షునిరాజ్యము, జనులను గూర్చి ఒక గ్రంథమును వ్రాసెను. బుద్ధుని జన్మస్థలము, జ్ఞానోదయస్థలము మొదలగు వానిని చూచెను. ఆయా దేశము నందలి జనుల నడవడికలు, ఆచార వ్యవహారములు, సుఖదుఃఖములను గురించియు వ్రాసియుంచెను.

# సంక్రాంతి పర్వము

(వెనుకటిసంచిక తరువాయి)

"వి క ట క వి"
శ్రీమాన్ కె. వి. ఆర్. ఆచార్యహారితస్, ఏలూరు.

మున్ను శరతల్ప భీష్ముండు మిన్నుఁజేరు
ఉత్తరాయణ పుణ్యకాలోషసులివి;
యగుట, గుమ్మడికాయల దానాలుగొంచు,
మఱియుఁ, బాత్రాలనంది సోమ్యాజులైన
వీరవైదిక బ్రాహ్మణపంక్తి పర్వ్వ
వంగి, వంగి, దానాలు మోయంగలేక. ౧

వరులు, వరిగలపంట, నివ్వారులపంట,
జొన్నపంటలు పట్టెదాసోఽహమంచు
దొరపొగాకుకుఁ, దదోkతమర్దనములఁ,
గాలివారలు, చంకల కూళ్ళమూట
లారఁ, బారరే ? చీమలబారులట్లు. ౨.

త్రేత వేరుశనగకోతల సమయంబ
దిద్దియాటఁ బ్రజలు బుద్ధిమీరి,
పచ్చివాని నమలి, పైత్యంబు తలకెక్క
మూర్ఛఁగందురకట, మూర్ఖసమితి !
చలికి నోర్వమికిని శాల్వాలొ కంబళ్లొ
కప్పుకొన్న ముసలి కారువారు
కక్కరానియట్లు కాగులందునఁబోసి,
ఉప్పువేసి, నీటనుడుకబెట్టి
గుడముతోడుగాగ గుగ్గిళ్లుతిందురు
ఒలిచి, వేరుశనగ లుడుకగానె.

పర్వదినమిది, పఁడుగ పండుగంచు
ఆలిసొమ్ములో ముత్తాతలాస్తులో నొ
కండు, జక్రవడ్డీకిఁ దాకట్టుఁబెట్టి,
ధనము ఋణదాతనుండి సంతసమొనర్చి
బ్రహ్మనిర్మితమగుఁ గృకవాకమనెడి
జాముగడియార మెడముకాల్సాచి, కత్తిఁ
గట్టి, పైపందెములకుఁ బైకంబుఁచేర్చి
జన్మరోషశిఖండిఁ, - బాషండమతులు -

విడువఁ బ్రాణాంతమవిహార, వెచ్చనెత్తు
టేళ్ళుఁ బార, పంతసముల నినుమడింత్రు;
తలఁపరొక్కొ ! తమడంబ్రపతాపశిఖల !
జీవితానంద మిడునొక్కో, జీవహింస ! ౨౮

కూలినాలిఁ జేసి కొనుపూట కూలీలు,
ఆరణాలడబ్బులైన రామి,
ఇంటిలోని చెంబొ, ఇత్తడిబిందెయో,
పూత్తమైన ఆలిపుస్తెనైనఁ
జేతిఁజిక్కువానిఁ జేఁగొంచు మూర్ఖులై,
పేడపిడకలమ్మె, బియ్యమందు,
పోటువేళో, యెల్లో, పొల్లుఁబోవవిభక్తి,
బువ్వవండి కంచమునను బెట్టి
కడుపుచల్లఁ జేయు - కాంతలతోఁ బోరి,
లేనిపోనివాని, లెమ్ము, తెమ్మ
టంచు, మూరువలుకుటాలస్యమైనచోఁ
జావగొట్టి, తమదుత్రోవఁబోయి,
కల్లుముంతలాని, కైపెక్కి, తలఁద్రిప్ప
ననఁగరాని బూతులాడి, తుదకు
దారినున్నవారి తాపంబుమైఁగొట్టి,
జైలులందుఁ బడెదు జాసు, లకట !
ఇల్లు, ఒళ్లు, గుల్ల, ఇల్లాలు సంక్రాంతి
పబ్బమందు, సౌఖ్యభారులహహా ! ! ౨౯

లక్కపిడుతల చిట్ల బేరంబువారు,
వివిధమచ్చైన బొమ్మ కావిళ్ళవారు.
సీమ పింగాణిపుల్చేరు జిలుగుపనుల,
శుద్ధఖద్దరు వస్త్రాలఁ జూపువారు.
వెదురుపనిముల్ల నేర్పుఁగా వించువారు,
సొంతదేశీయ నూల్బట్టఁ జూపువారు,
సిల్కు, కాశ్మీర శాలువాల్ చిత్రమైన
రత్నకంబళ్లు కల్గు బేరంబువారు,
చీని చీనాంబరలఁ దివాచీలవారు,
అరయ మేల్పట్టు పుట్టములమ్మువారు,
జిలుఁగు చేకుట్టుపనిని రాజిల్లువారుఁ
లలిత చిత్రవస్తువుల బేరమ్మువారు,

పేము, కుర్చీల, మేజాల, ప్రియంపు టేకు
నల్లరోజ్వుడు దేవదార్ నాణ్యమైన
కలపయిడి తీలయుంగళ్ళు గల్గువారు,
చిత్రచిత్ర భావవిచిత్రతరపు
సకల పరదేశవస్తు సంచయమువారు,
వింతసుమ ఫలములనుఁ జూపించువారు,
డంబుతిను బండమున్మ మిఠాయివారు,
కాశికాదులఁ జూపు చుక్కాని వారు,
హితకఁ జూదాల డబ్బునార్జించువారు,
దొంగతనముఁ, సొమ్ముల దోచువారు,
మోసగాండ్రును, నాటక వేషగాండ్రు,
ఇనుము, ఇత్తడి, కంచుపాత్రనెడివారు,
కలను, తిరుగండ్లు రోలురోకండ్లవారు,
మనదురింకెంద తెందటో ఘనులువారు,
బహుళ, నేర్పొప్పులుఁగల వ్యాపారివారు,
సర్వసంక్రాంతి సంతల సాహుకార్లు.

బుడబుడయును డమరకమున
నడిరాత్రిబలికెడు శకునపుఁబక్షివలెన్,
అడిగినయటువలె జనులకుఁ
బుడిబుడిఁబలికెడి విభావి బుడబుక్కడవా!

బసవ దేవుగొల్వఁ బరమిహంబుఁగలుంగు
ననఁగఁదలనుఁ నౌనటంచునూపు
గంగిరెద్దు కోడ, గడపగడపకుతోఁ
గొంచుఁబోయి భిక్షుఁగొంచుఁబోవు
గంగిరెద్దువారు గానంబు సన్నాయిఁ
బాడుచుండ్రు తీర్చి పంగనాము.

మొదటి భార్యవు హేమంతమునకు నీవ?
ముద్దుమరదలవు వసంతమునకునీవ!
మధ్యమగ్గురి బావల మరదలీవ!
కంతుమోహాన పంచ కసాయకాసహాయ
ధన్యలౌబంతి పూలకుఁ దల్లివీవ!
జయము! విజయోస్తు! నీకు, దిగ్విజయరస్తు!!

---

# హిందూదేశ చరిత్ర

5 వ త ర గ తి

(ప్రశ్నోత్తరములు - 1942 సం॥ ఫిబ్రవరి సంచిక తరువాయి)



వేదుల అన్నయ్యశాస్త్రి,
హెడ్మాష్టరు - బోర్డు ఎలిమెంటరీస్కూలు, గురమ్మపాలెం
తాతా జగన్నాధరావు.
హెడ్మాష్టరు - బోర్డు ఎలిమెంటరీస్కూలు, సాంర్యాం.

8. చోళరాజ్యము ఎచ్చటనుండి ఎంతవరకు వ్యాపించియుండెను? రాజధాని యేది?

జ: చోళరాజ్యము ఒకప్పుడు కృష్ణానది మొదలు కావేరినదివరకు వ్యాపించియుండెను. దీనికి ఒరయూరు రాజధాని.

9. చోళరాజుల పరిపాలన మెట్లుండెడిది ?

జ: యీరాజులు శౌర్యవంతులు, విద్వాంసులు, భాషాభిమానులు. అనేక దేవాలయములను కట్టించిరి. పండితులకు, దేవస్థానములకు మాన్యము లిచ్చిరి. వీరు మౌర్యులవలె పంచాయతీలను ఏర్పరచి న్యాయముగా రాజ్యపాలనము చేసిరి. కాని పన్నులు వసూలుచేయుటలోను, శిక్షలు విధించుటలోను మౌర్యులవలె కఠినులై యుండలేదు.

10. రాజేంద్ర చోళు డెవరికుమారుడు ? యితనికిగల బిరుద మేది? యితనిరాజ్య మెంతవరకు వ్యాపించెను ? రాజధానిఏది ?

జ: రాజేంద్రచోళుడు తంజావూరిలో బృహదీశ్వ రాలయము గట్టించిన రాజరాజ చోళుని కుమారుడు యితనికి గంగైకొండచోళుడను బిరుదుగలదు యితని రాజ్యము గంగానది మొదలు కావేరినది వరకు వ్యాపించియుండెను. యితని రాజధాని కుంభకోణమునకు సమీపమునయున్న గంగైకొండ చోళపురము.

11. కుళోత్తుంగు డెవడు ? యితని రాజధానియేది ? 'యితనినిగూర్చి క్లుప్తముగా వ్రాయుము.

జ: యితడు రాజేంద్రచోళుని కుమార్తెకొడుకు. తాతగారి రాజ్యమునుజయించి తంజావూరునకు రాజధానినిమార్చి రెండురాజ్యములను ఏలెను. యితడుశౌర్యవంతుడు, బుద్ధిమంతుడు. విద్యను, శైవమతమును వ్యాపింపచేయుటకు పాటుపడెను. రామాయణమును అరవములో పద్యరూపమున వ్రాయించెను.

12. యీరాజ్యము తుద కేమయ్యెను ?

జ: కుళోత్తుంగచోళుని తరువాత వచ్చిన రాజులు అసమర్థులగుటచే క్రమక్రమముగా క్షీణించి, మిగిలినది విజయనగరసామ్రాజ్యములో కలసిపోయెను.

13. పాండ్యులెవరు? వారిరాజ్యమేది? రాజధానియేది?

జ: పాండవుల సంతతివారమని చెప్పుకొనుటచేత వీరిని పాండ్యులని పిలిచెడి వారు. ఇప్పటి మధుర, రామనాధపురం, తిరునల్వేలిజిల్లాల ప్రదేశము పాండ్యరాజ్యము. వీరి రాజధాని కొర్కై నగరము.

14. పాండ్యరాజులలో గొప్పవాడెవడు?

జ: వీరిలో సుందరపాండ్యుడు గొప్పవాడు.

15. యీరాజులచే కట్టించబడిన సుప్రసిద్ధ దేవాలయమేది? తుదకు వీరెవరిచే నోడింపబడిరి?

జ: యీరాజులు మధురమీనాక్షి దేవాలయమును కట్టించిరి. తుదకు చోళ రాజులచే వీరు ఓడింపబడిరి.

Syllabus Heading —Chandragupta.

1. అశోకుని తరువాత ఎన్ని సంవత్సరములకు గుప్త సామ్రాజ్యము స్థాపించ బడెను? గుప్తసామ్రాజ్యమునకు మూలపురుషుడెవరు?

జ: అశోకుని తరువాత 400 సంవత్సరములకు గుప్త సామ్రాజ్యము స్థాపించ బడెను. మూలపురుషుడు చంద్రగుప్తుడు.

2. ఇతఁ డేవంశపు పిల్లను పెండ్లియాడెను? వివాహానంతరము సంపాదించిన రాజ్యములెవ్వి?

జ: ఇతడు లిక్షువి వంశపుపిల్లను పెండ్లియాడెను. లిక్షువివంశపువారి సహాయ మున మగధరాజ్యము, దాని చుట్టుప్రక్కలనున్న చిన్న రాజ్యములను జయించి సామ్రాజ్యమును స్థాపించెను.

3. చంద్రగుప్తుని రాజ్యపరిపాలననుగూర్చి క్లుప్తముగా వ్రాయుము?

జ: చంద్రగుప్తుడు కవి. విద్యాభిమాని అన్ని మతములను సమానముగా చూచెడివాడు. తనరాజ్యములో వైద్యశాలలు స్థాపించెను. ఉరి మొదలగు కఠినశిక్షలు తీసివేసెను. పండినపంటలో కొంతభాగము పన్నులు వసూలుచేయుచుండెను. ప్రజలు పన్నులబాధగాని, చోరులబాధగాని లేకుండిరి. హిందువులు, బౌద్ధులు సఖ్యతతో నుండిరి. ప్రజలు మద్యపానము మొదలగు దుర్వ్యసనములులేక జీవించిరి.

4. చంద్రగుప్తునకుగల బిరుదమేది?

జ: యితనికి విక్రమాదిత్యుడను బిరుదుగలదు.

5. నవరత్నము లననేమి?

జ: చంద్రగుప్తుని ఆస్థానమున కాళిదాసు, ధన్వంతరి, క్షపణకుడు, శంకుడు, వేతాళభట్టు, ఘటకర్పరుడు, వరాహమిహిరుడు, వరరుచి, అమరసింహుడు అను తొమ్మండుగురు పండితులుండెడివారు. వీరొక్కొక్క రొక్కొక్క శాస్త్రమున ప్రవీణులు. వీరికే నవరత్నములని పేరు. [సశేషము.

---

# సృష్టి పరిశీలనము

( 5 వ తరగతి - ప్రశ్నోత్తరములు )



వేదుల అన్నయ్యశాస్త్రి & తాతా జగన్నాధరావు

(N. B మద్రాసు దొరతనమువారి 1939 సం||రపు ప్రాథమిక విద్యా ప్రణాళిక ననుసరించి యీ ప్రశ్నోత్తరములు రచింపబడినవి.)

Syllabus Heading —Planning and laying out a garden.

1. నేల యనగా నేమి ? అందలి వివిధపదార్థములను వేరొనర్చుము ?

జ: భూమియొక్క పై పొరకు నేలయని పేరు. దీనియందు ఏటేట పుట్టిపెరిగి చచ్చెడి మొక్కలవేళ్లు అల్లుకొనియుండును. రెండవపొరయందు చాలకాలము బ్రతికెడి చెట్లవేళ్లుండును. దీనికి లోనేలయని పేరు. లోతుగా ఒకగోతిని త్రవ్వి దాని ప్రక్కలను పరిశీలించినచో భూమి పొరలు పొరలుగా కనిపించును. పైకి కొన్ని అంగుళముల లోతువరకు నల్లని మట్టియుఁ దాని యడుగున సన్నని యిసుకయు, దాని క్రింద గంద్రయిసుకయు, నాల్గవపొరయందు రాళ్లును కన్పించును.

2. నేల లెట్లేర్పడుచున్నవి ?

జ: గాలి, మంచు, ఎండ, వర్షములచేత పర్వతములు శిథిలమై నీటి ప్రవాహములతో కొట్టుకొని వచ్చుటచే నేల లేర్పడుచున్నవి.

3. నేలలరకము లెన్ని ? అవి యేవి ? వాటి కాపేరెట్లు గల్గెను ?

జ: నేలలలో ఇసుకనేల, బంకమట్టినేల, చవుడునేల, ఒండ్రునేల, నల్లప్రత్తినేల, ఎఱ్ఱచెక్కనేలలను, ఆరుముఖ్యరకములు గలవు. నేలలయందుఎక్కువగానుండు నంతర్భాగమును బట్టియు, నేలల రంగును బట్టియు, పేర్లు గల్గుచుండును.

4. వివిధరకముల నేలలను వేరొనర్చి ఆయా నేలలలో ఇసుక, బంకమన్ను లెట్లున్నవో తెల్పుము ?

జ: ఇసుకనేల:—ఇసుక ఎక్కువ.

బంకమట్టినేల:—బంకమన్ను ఎక్కువ.

చవుడునేల:—యిందు లవణపదార్థములు ఎక్కువ.

ఒండ్రునేల:—ఇసుక, బంకమన్ను సమభాగములుగా నుండును.

నల్లని ప్రత్తినేల:—బంకమన్ను ఎక్కువ, ఇసుక తక్కువ.

ఎఱ్ఱచెక్కనేల:—ఇసుక ఎక్కువ, బంకమన్ను తక్కువ.

5. సస్యానుకూలమగు నేలయేది ? ఏల ?

జ: సస్యమున కనుకూలమైనది ఒండ్రుమట్టినేల. యిందు యిసుక, బంకమన్ను సరిసమానముగానుండును. దీనికి జలగ్రహణశక్తియు, జలధారణశక్తియు గలవు.

యీ నేల ఎక్కువ బోలుగాగాని, ఎక్కువ గట్టిగాగాని యుండదు. దీని యందు సస్యములు బాగుగా పెరుగును.

6. ఇసుక నేలలను, బంకమట్టి నేలలను సస్యాను కూలముగా నుండుట కేమి చేయవలెను ?

జ: ఇసుక నేలలను సారవంతముగా చేయుటకు పశువుల మందకట్టుట, పచ్చి ఎరువులను వేయుట, ఒండ్రుమట్టిగల నదీజలమును తరుచు పెట్టుచు తీసివేయుచుండుట మంచిది.

బంకమట్టి నేలలకు ఇసుకగాని, సున్నముగాని, చేతనపదార్థముగాని చేర్చినచో వ్యవసాయమున కనుకూలించును.

7. నేలయొక్క సారమునెట్లు నిర్ణయింపవచ్చును ?

జ: నేలయందలి చేతన పదార్థము, లవణపదార్థము, జలగ్రహణశక్తి, జలధారణశక్తులనుబట్టి నేలలసారము నిర్ణయించవచ్చును.

8. ఎరువులనగా నేమి ? అందలి రకము లేమి ?

జ: వృక్షములకు కావలసిన ఆహారపదార్థములుగల వస్తువులకు ఎరువులని పేరు. నత్రజనములు, భాస్వరములు, పొటాషియములుఅని ఎరువులుమూడురకములు.

9. నత్రజనము లెన్ని విధములు? అవి యేవి? ఉదాహరణలిమ్ము ?

జ: చేతనపదార్థము గల ఎరువులకు నత్రజనము లనిపేరు ఎరువులన్నిటిలోను ముఖ్యమైనది చేతనపదార్థము. యిది ముఖ్యముగ కుళ్ళిపోయిన చెట్లభాగములు, జంతుభాగములు కలిసియున్నది. నత్రజనములు, పచ్చిఎరువు, ఆకుఎరువు, గొడ్లఎరువు, కృత్రిమనత్రజనములు అనినాల్గు విధములు.

1. పచ్చిఎరువు:- ఉలవ, సెనగ, పెసర, నీలి, వెంపలి మొదలగు మొక్కలు.

2. ఆకు ఎరువు:-వేప, రావి, నేరేడు, జిల్లేడు మొదలగు చెట్లఆకులను పచ్చివిగాని, ఎండువిగాని నేలలోవేసిదున్నినచో అవికుళ్ళి నేలసారవంతమగును.

3. గొడ్లఎరువు:- ఆవు, గేదె, మేక మొదలగు జంతువుల మలమూత్రములు ఎక్కువ సారవంతమగు ఎరువులు.

4. కృత్రిమనత్రజనములు:-మద్రాసు ప్యారీకంపెనీవారుఅమ్మోనియానత్రితమను లవణపదార్థము తయారుచేయుచున్నారు.

10. నత్రజనములు, భాస్వరములు, పొటాషియములు ఏయే పైరుల కవసరము ?

జ: నత్రజనములు:- తోటకూర, గోంగూర మొదలగు ఆకుకూర లిచ్చు మొక్కలకు నత్రజని ఎక్కువగాగల ఎరువులు కావలెను.

భాస్వరములు:-చెరకు, వరి, జొన్న, పండ్లచెట్లకు భాస్వరములు ఎక్కువగాగల ఎరువులు కావలెను.

పొటాషియములు:-పొగాకు, వంగ, మిరప మొదలగువానికి పొటాషియము ఎక్కువగాగల ఎరువులు కావలెను.

11. భాస్వరము లేయే ఎరువులలో విశేషముగా నున్నవి ?

జ: భాస్వరములు ఎముకలపొడియందు, గొడ్లమూత్రమందు చేపలపొట్టునందు గింజల పిండియందుగలవు.

12. పొటాషియం సంబంధమగు లవణ పదార్థమెందు గలదు ?

జ: కర్రబూడిద, పిడకలబూడిదలలో గలదు.

[ సశేషము ]

---

# పట్టుదల

బాలకవి: పూసపాటి నాగేశ్వరరావు, రావెల.

తే॥ గీ॥ వినుడు మేధావినీపురంబును సుమేధుఁ
డనుమహీపతి పాలించు । న్యాయగరిమ
తోడ; క్షాత్రధర్మము వీడ । నాడకుండ;
ప్రజలమన్ననంబులకుఁ బా । త్రత గడించి.

తే॥ గీ॥ అతని ఖడ్గంబునకు సమ । స్తశత్రులు సలిపి
తలనువంపనిమేటియౌ । ధరణివిభుఁడు
గలఁడె ? సింహళాధీశుఁడౌ । క్రూరుఁడు దక్క
కంచు కాగడాల్ వేసి । లోకానఁగాన.

క॥ ఆసింహళాధి నాథుని
రోసముతో గెలువ నిజవ । రూధినితోనం
తే సంగ్రామము జయువి
శ్వాసము ననుమేధుఁడాఱు । సారులొనర్చెన్.

తే॥ గీ॥ కాని జయముచేకూఱని । కారణమున
నొక్కనాడు విచారంబు । పిక్కటిల్ల
నిజగృహాభ్యంతరమున సం । దేహడోల
నూగులాడుచు మఱికూరు । చున్నయపుడు.

మ॥ తనదారంబును బట్టి పైకరుగను । త్సాహించి పల్మారు వీ
డని చిత్తంబునఁబుట్టు పట్టుదలతో । డక్ యత్నముల్ సల్పి, నుం
తనిరుత్సాహము లేక, తుట్టతుదకున్ । గట్టెక్కియున్నట్టి చ
క్కని సాలీడొకడిద్ధ బోధకుఁడనన్ । గన్పట్టెఁగన్దోయికిన్.

తే॥ గీ॥ పట్టుదలఁబూని యత్నంబుఁ । బఱపెనేని
యెట్టిదుర్ఘటకార్యంబ । యేనికడకు

సానుకూలంబుగా నేర్చు । ననిసుమేధుఁ
డొక్కకత నేర్చి యాజికు । డ్యుత్తుఁడయ్యె !

చ. దురమున రుద్రమతోభటుల । తోనతి చంగ తురంగ గంధసిం
ధురనికరంబుతో వెడలి । దోర్బల సాహస శౌండిమంబుఁగ
న్నుఱిచి విరోధిరాజుఁగర । వాలనుధాటికి నప్పగించి యా
సిరులహరించెఁ బట్టుదల । చేఁగల లాభ మెఱుంగ నేర్చితే!

క॥ కావున నాభూమీశ్వరుఁ
డావిధి సాలీనివలన । నార్జించిన సం
భావితనీతి పథంబును
భావించి నిరంతరంబు । వర్తిలు డెపుడున్

---

# వీడ్కోలు - స్వాగతము

విజయనగరం, రేంజి సీనియర్ డిప్యూటీయినస్పెక్టర్సుఅగు శ్రీ బొల్లాప్రగడ అచ్యుతరావుపంతులు బి. ఎ., ఎల్. టి గారి వీడ్కోలు సమయమందు, శ్రీ గేదెల సుందరనారాయణ నాయుడు, బి ఎ., ఎల్. టి., గారి ఆహ్వానసమయమందు, విజయనగరం, ప్రాథమిక విద్యాపాఠశాలల ఉపాధ్యాయసంఘము జరిపిన గౌరవ కార్యక్రమ విధానము.

యీ కార్యక్రమము విజయనగరం, "రాజాబజారు" ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూలులో 22 ఫిబ్రవరి 1942 తేది మధ్యాహ్నము 3 గంటలకు శ్రీ కిళాంబి రంగాచార్యులు అవరఘళ్ M. A, B. L, (Chief Lecturer in Mathematics in Maharaja's College) గారి అధ్యక్షత్వముక్రింద జరుపబడినది విజయనగరం రేంజి సీనియర్ డిప్యూటీ యినస్పెక్టరుగారికి శంఖుచక్రములవలె వెలుగుచుండెడి శ్రీ కె సత్యనారాయణ పటక్, బి ఎ, బి యిడి, గారున్ను, శ్రీ యన్. వెంకట్రామయ్యపంతులుగారున్ను దయచేసిరి పురప్రముఖులు మరికొంతమంది విచ్చేసిరి సుమారు 250 మంది ఉపాధ్యాయులు ఈ మహోత్సవమును చూచుటకు విచ్చేసిరి

1. భగవత్ప్రార్థన యథావిధిగా జరిగినది

2. విజయనగరములోని ఉపాధ్యాయబృందమునకు అధ్యక్షుడైన శ్రీ కంచెర్లవారి Aided Elementary School Manager గారగు శ్రీ పక్కి జగన్నాథరావు పట్నాయక్ గారు ఆలోజన ఆసంఘ సమావేశ మేలఅచ్చట జరుగుచున్నదో, ఎందునిమిత్తమై అంతమందిసోదరులు అక్కడకు విచ్చేసిరో, జరుగబోవు కార్యక్రమ విధానమేమో సాకల్యముగా వివరించిచెప్పిరి.

3. శ్రీ అధ్యక్షులవారు ప్రారంభ వాక్యములను చెప్పుచూ పై యిద్దరి విద్యా పరీక్షాధికారుల (Inspecting Officers) యొక్క గుణా గుణములను కొన్ని చెప్పిరి

4. శ్రీ బి అచ్యుతరావు పంతులు, బి ఎ, ఎల్ టి, గారు ఉపాధ్యాయబృందమునకు కొన్ని నీతులను గరపి వారందరిని ఆశీర్వదించిరి

5. శ్రీ జి. సుందరనారాయణ నాయుడు, బి ఎ. ఎల్ టి, గారు కూడ కొన్నివిషయములను తెలియచేసిరి.

6. విజయనగరరేంజి ఉపాధ్యాయసమితివారు పైయిరువురి అధికారులపై కొన్ని పద్యరత్నములను రచియించి, వీనులకింపుగా వినిపించి వారికి సమర్పించిరి.

7. వచ్చిన ప్రముఖులందరకు, విజయనగరములోని ఉపాధ్యాయబృందమునకు కార్యదర్శియగు శ్రీరాజాబజారు స్కూలు Manager శ్రీ ఎ. టి కె రామానుజయ్యగారు అల్పాహార విందును జరిపించిరి.

8. పైఅధికారులు ప్రసిడెంటుగారు, ఉపాధ్యాయబృందముకలసి ఛాయాచిత్రమునతీ యించుకొనిరి.

9 ఇంద్రద్యుమ్న ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాలలో చదువుచున్న బాలునిచే చక్కగా కృష్ణ వేషముతో కాళింగమర్దన నృత్యము ప్రదర్శింపబడినది.

10. శ్రీ కన్యకాపరమేశ్వరీ స్కూలు బాలికలు, ఫ్యాక్టరీవార్డు స్కూలుబాలికలు చక్కనిజాతీయ గీతములుపాడి సభికులను ఆనందపరవశులుగా చేసిరి

11. ఊదిపేట, దావాలపేట స్కూళ్ళ మేనేజరు శ్రీ బగ్గాం రామమూర్తిగారు చక్కగా మ్యాజిక్ గావించిరి.

12. బుడతనపల్లి బోర్డుస్కూలు హెడ్‌మాష్టరు శ్రీ నిష్ఠల అప్పల నరసింహంగారు చిత్రవిచిత్ర ముగా మ్యాజిక్ గావించిరి

13. ఫ్యాక్టరీవార్డు స్కూలుపిల్లలు చక్కగా కోలాటమాడిరి

14. "కృష్ణలీల" నాటకములో ఒకసీను జరిపిరి

(a) ధకినివీధి స్కూలు మేనేజరు "అభినవయము" "నటసింహ" అను బిరుదులబడసిన శ్రీ ప్రతాపరావు వెంకట సూర్యనారాయణ పట్నాయక్ గారు, కంసునిపాత్రను మహాద్భుతముగా నటించిరి.

(b) యస్. రామానుజయ్యగారు అక్రూరునిపాత్రను పోషించిరి

(c) అదపాక ఆదిరామమూర్తి అనుకుర్రవాడు శ్రీకృష్ణపాత్రమ నేర్పుతో నిర్వహించెను.

(d) విజయనగర ఉపాధ్యాయసంఘమువారు, కంసునిపాత్రను వేసిన శ్రీ ప్రతాపరావు వెంకట సూర్యనారాయణ పట్నాయక్ గారికి - వారియొక్క నటనా కౌశలమునకు, గాన ప్రావీణ్యతమునకు మెచ్చి అరువది తులముల వెండికప్పునూ " రంగమార్తాండ " అనుబిరుదమునూ యిచ్చిరి.

(e) వందన సమర్పణముతో నాటిరాత్రి 8½ గంటలకు ఈమహోత్సవము ముగించబడినది.

Chaganti Veerabhadra Rao,
Representative,
Messrs Rama and co.
Vizianagram.
22 nd February 1942.

---

## శ్రీ బొల్లాప్రగడ అచ్యుతరావు పంతులు, బి. ఏ., యల్. టి., గారికి

# వీడ్కోలు

శా. శ్రీ బొల్లాప్రగడాన్వయాంబుధి శశీ ! శ్రీయచ్యుతేంద్రా ! పవి
త్రా ! భూమీసురవర్య ! ధర్మగుణసాంద్రా ! సజ్జనస్తోత్ర పా
త్రా ! బాహుళ్య గభీరస్వాంత ! కరుణోదారా ! నిరాడంబర
ప్రాబల్యాదిత దిగ్దిగంతరయశః ప్రాముఖ్య ! సద్భావనా !

సీ. దాస్యపంకిలమునఁ దపించుచుం తల్లిని, దరిజేర్చిరక్షించు దారిసెటుఁగ
నజ్ఞాన తిమిరాన నసురుసురౌసోద, రాళికి వెలుతురు నరయఁజేయఁ
గష్టభూతంబులఁ గఱలింపబడు నుపాధ్యాయులు వెలువడుదారి నరయ
విద్యార్థిలోకాన వెలుఁగిడి భావిని, నవ్యసౌఖ్యపు జీవనమ్ముఁ దెలుప

దివిని వెలువడి యేతెంచి భువిని జన్మ
మందితివి దివ్యసందేశ మందఁజేయ;
బొల్లప్రగడాన్వయాంభోధి పూర్ణ చంద్ర
అచ్యుతార్య ! యశోధుర్య ! అనఘవర్య !

సీ॥ బడులపరీక్షకుఁ బ్రభువుగా నేతెంచి, నిజజన్మవాసన నెగడు కొఱకుఁ
బైయధికార్ల చేఁ బలికించుకొనకుండ నధ్యాపకులకెల్ల నమృతమొసఁగి
యజ్ఞాన మెడలింప ననువైనమార్గముల్, పసిపిల్లలకు బోధపఱుపఁజేసి
పునరభివృద్ధికిఁ బొడసూపుచిహ్నము, లాంధ్రమాతకుఁజూపి యడలువాపి
అచ్యుతుండను నామంబు సార్థకంబు
జేసి యేలితి రెండేండ్లు; మోసులెత్తి
విరిసి; దిశదిశావ్యాప్తిగాఁ బరిమళించె
నీదు కీర్తిరసాలంబు నిష్కళంక !

తే. మా యభాగ్యవశంబున మమ్ము వీడి
వేఱు ప్రాంతమునకుఁబోవు విధముఁగూర్చె
దైవ; మతనిలో లేదొకో దయను తావు
నీ వియోగంబు దుర్భర నీరదంబు ! ! !

విధేయుఁడు,
అరసాడ ధర్మారావు,
విజయనగరం రేంజీ ఉపాధ్యాయ సమితి.

---

# స్వాగతము

చ॥ శిశిరుఁడువోవ మాధవుఁడు శీఘ్రగతిం జనుదెంచి గున్న మా
విశిఖర మెక్కెఁ; గ్రొంబువులువిచ్చి సువాసనవీని హెచ్చి న
ల్దిశలను గ్రమ్మె, లోకులకుఁ దేనియలానెడి భాగ్యమబ్బె; నీ
దశ మన గేదెలాన్వయుఁ డుదారుఁడురాగ ఫలింపదో చెపిన్॥

సీ॥ వీరభద్రుఁడు మున్ను వీణియనిర్మించె, నిర్మాణ చాతుర్యమర్మ మెఱిఁగి
అచ్యుతుండద్దాని నందాల మెఱయించి, తంత్రులు సవరించె ధర్మ మెఱిఁగి
సుందరుండవు నీవు సులలితకోమల, కరపల్లవంబులు గ్రోలుచుండఁ
గదలించి శ్రావ్యంబుగా నదింపఁగఁజేసి, మేళకర్తలతోడ మేళవించి
నిదురఁగొనియున్న హృదయాల నిదురలేపి
జ్ఞాన నృత్యంబు వెల్లువింపఁ జాలెదంచు
నమ్మికొని యుంటిమయ్య ! నయమ్ముమీఱ
లెటులఁ బాలించెదో మమ్ము నింకమీద॥

విధేయుఁడు,
అరసాడ ధర్మారావు.
విజయనగరం రేంజీ ఉపాధ్యాయ సమితి.

---

# విశాఖపట్టణ బాలికాపాఠశాలోపాధ్యాయుల సమావేశము.

ఆన 1942 సం॥ ఫిబ్రవరి 14 తా. శనివారము విశాఖపట్నము బాలికా పాఠశాలల ఉపాధ్యాయుల సమావేశము sister M Gonzaga అమ్మగారి యాధిపత్యమున జరిగెను. A. G. Israel మాష్టరుగారు A. R. P. సంబంధమగు ఒక చక్కని పాటచేసి పాడి వినిపించిరి. Mr. P. R. Swamy B.A. గారు A. R. P. సందర్భమున వివిధ రకములైన బాంబులుగూర్చి సుస్పష్టమగు ఉపన్యాసమిచ్చిరి. రెండు బాంబులను వెలిగించి, ఒకటి ఇసుకబస్తాతో ఆర్పుటయు, మరియొకటి Styrrup పంపుతో ఆర్పుటయు ముగ్గురు A. R. P. వారితో చేయించి చూపిరి. మా ఉపాధ్యాయ సమాజము వారు యుద్ధనిధికొరకు రూ 71-0-0 విరాళముల నొసగిరి.

జి. విజమ్మప్రకాశం,
సెక్రటరి.

---

# ప్రభుత్వ ఫర్మానాలు

జనాభారిజిష్టరుల ఆబ్‌స్ట్రాక్టు తయారుచేసి పంపునపుడు బడిలో చేరవలసియున్న బాల బాలికల సంఖ్యనుకూడ తరగతివారిగా (అనగా హిందూ, మహమ్మదీయ, పెద్యాలు) వ్రాసి పంపవలెను.

పల్లెలందు నిజమగు యుద్ధవార్తలు ప్రచారముకాకపోగా అసత్యవార్తలు వినిపింపబడి భయభ్రాంతులనుగా జేయుచున్నవి. అందువలన ప్రతి గ్రామమునందును గ్రామాధికారులతోబాటు పాఠశాలోపాధ్యాయులుకూడ కనీసము వారమునకు రెండు పర్యాయములు పాఠశాల వదిలిన యనంతరము గంట వ్యవధివరకు ప్రభుత్వమువారిచే ప్రకటింపబడుచున్న నిజమగు యుద్ధవార్తలను ప్రజలకు చదివి వినిపించి బోధపరుపవలెను.

రోడ్డురూల్సును గ్రామములం ఉపాధ్యాయులు తెలియజేయవలెను.

ఇదివరలో ట్రైనింగు ప్యాసైన యిద్దరుపాధ్యాయులు గల పాఠశాలయందు ట్రైనింగు కాని వారొకరుండవచ్చునను నియమముండినది. ఇప్పుడు దానికి పూర్తిగా మార్పురాకపోయినను కొంతమార్పు జరిగినది.

ప్రతి ట్రయినింగుపాఠశాల ప్రధానోపాధ్యాయునివద్ద ఆయాసంవత్సరములందు చదివి నిరుద్యోగులుగానున్న వారి జాబితా యుండును. ఉపాధ్యాయుడు కావలసియున్న మేనేజరు ముందుగా సదరు జిల్లా ట్రయినింగు పాఠశాల ప్రధానోపాధ్యాయునకు దెలిపి ఎవరైన నుండిరేమో కనుగొనవలెను. ఒకవేళవారు లేరను సమాధానము పంపినచో సదరు ప్రత్యుత్తరమును జతపర్చి రేంజి ఇన్‌స్పెక్టరునకు తాను అన్‌ట్రైన్డు

పాధ్యాయుని ఏర్పాటు గావించుకొనగలందులకై యనుమతి యివ్వ దరఖాస్తు జేయవలెను. వారును సదరు కాగితమును D. E. O. కు పంపుదురు. D. E. O. అంగీకరించియున్న పక్షముననే అన్‌ట్రైన్డు వారిని చేర్చుకొనదగి యుండును. లేనిచో ఈ తంతు లేకుండా చేర్చుకొననిచో గ్రాంటు శిఫార్సుచేయబడదు.

తప్పిపోయిన ట్రైన్డువారి సందర్భములందును పైవిధముగానే చేయవలసి యుండును.

పాఠశాల గది గోడలకు ఫొట్యాపులను వేనిని తగిలించి యుంచరాదు. వాని నొకపెట్టెయందు భద్రపరచి తాళమువైచి ప్రధానోపాధ్యాయుడు తన పూచీ కత్తులో నుంచవలెను. ఔసరమగు వేళలందు దప్ప వానిని వెలికి దీయరాదు. అన్యుల కీయబడరాదు.

యుద్ధభయముచే మదరాసు పట్టణమును విడిచి వచ్చిన బాలబాలికలు మీ పాఠశాలయందు జేరవచ్చినచో సదరు రేంజి ఇన్‌స్పెక్టరునకు అనుమతి కొరకు వ్రాయవలెను. అట్టివారికి ఏ పరిస్థితులందైనను అనుమతి యీయబడును.

ఇదివరలో క్యాజుయలు సెలవులు సంవత్సరమునకు పది దినములు మాత్రమే యని దెల్పబడినది. తిర్గి దానిని పదునైదు దినములుగా మార్పు జేయబడినది.

పాఠశాలలందు బాలికలసంఖ్యను వృద్ధిజేయుటయేగాక బాలుర సంఖ్యనుకూడ వృద్ధి చేయవలెను.

ప్రాథమిక పాఠశాలలందు 1 వ తరగతిలో నూఱుమంది విద్యార్థులుండి యుండినచో రెండవ తరగతియందు 75 చొప్పునను, 3 వ తరగతియందు 50 మంది చొ॥నను 4 వ తరగతియందు 30 మంది చొప్పునను యుండవలెను. అనగా పాఠశాలయందలి 1, 2, 3, 4, 5 తరగతులందు వరుసగా 100 : 75 : 50 : 30 : 25 నిష్పత్తికి బాలబాలికలు తగ్గియుండరాదు.

పూర్వము 2 సంవత్సరములకు మించిన కాలము కేతరగతి యందున్న విద్యార్థులు స్టాగ్నేటెడ్‌గా గణింపబడెడువారు. ఇప్పుడు ఒక సంవత్సరమునకు మించినకాలము కే తరగతియందున్న బాలబాలికలకు స్టాగ్నేషను వర్తించును.

పైనుదహరించిన రెండు నిబంధనలను అనుసరించుటకుగాను ప్రతితరగతియందు అర్ధసంవత్సరపు ప్రమోషనుల గావింపవచ్చును.

మొదట సూచించిన నిబంధనయని నిష్పత్తిప్రకారము విద్యార్థుల సంఖ్యను సవరించుకొనుటకుగాను, తక్కువఅవరేజిగల విద్యార్థులనుగూడ పైతరగతులకు ప్రమోషను జేయరాదు.

ఇట్టి అక్రమపు ప్రమోషనులను, పరిక్షాధికారులు తాము పరీక్షించు సమయమునందు పరికిలించి అట్టి వారిని డిప్రమోటు (తిర్గి వెనుకటి తరగతికే పంపించుట) చేయుదురు.

పైన సూచించిన విధముగా విద్యార్థులు డిప్రమోటు కాకుండగను, స్టాగ్నేటెడ్ కాకుండగను, సదరు ఆవరేజి తక్కువ విద్యార్థుల సందర్భమునందు ప్రత్యేకముగు శ్రద్ధ గైకొని బోధింపవలెను.

ఏకోపాధ్యాయులుగల పాఠశాలలందు సత్వరము సహాయోపాధ్యాయులను నియమింపక పోయినచో రికగ్నిషను రద్దుకాబడును.

పర్మిషను పొందకుండ 1-1-42 నుండి పనిచేయుచున్న ట్రయినింగు పొందని ఉపాధ్యాయులకును ట్రైనింగు తప్పిపోయిన ఉపాధ్యాయులకును, మూడువ సంత్సరముల లోగా ప్రాక్టికలు పూర్తికాని యుపాధ్యా యులకును గ్రాంటు శిఫార్సు చేయబడదు.

సాంవత్సరిక రిపోర్టులందు ఏకాలమును ఖాళీగా వదలరాదు. వ్రాయుటకేమి లేకున్న 'లేదు' అని వ్రాయవలెన.

ట్రైనింగు పొందనివారినిగాని, లేక తప్పిపోయినవారినిగాని లేక, 3 సంవత్సరము లలోగా ప్రాక్టికలు పూర్తికాని వారినిగాని ముందుగా పరీక్షాధికారిద్వారా అనుమతి పొందియుండనిది పాఠశాలయందు ఉపాధ్యాయునిగా జేర్చుకొనరాదు.

ఒక తరగతియందు రెండు శెక్షనులు చేయుటకు చాలినంతమంది విద్యార్థు లున్నప్పుడు సదరు విషయము పరీక్షాధికారికి దెలియపర్చి, యనుమతి పొంది మఱి శెక్షనులు చేయవలెను. శెక్షనులుచేసిన పిదప అనుమతి కోరరాదు.

తరగతిని శెక్షనులు చేయుటకొరకుగాను ఏ సంవత్సరమున కాసంవత్సరము నూతనముగా పరీక్షాధికారినుండి పర్మిషను పొందియుండవలెను.

శెక్షనులు మంజూరు చేయమనికోరు రిపోర్టునందు తరగతియొక్క విద్యార్థుల రోలుసంఖ్యయు, సరాసరి హాజరును నుదహరింపవలెను.

ప్రైవేటుపాఠశాలలందలి ఉపాధ్యాయులుతప్పుజేసినఎట్లు శిక్షాపాత్రులగుచున్నా రోఅటులనే లోపముగల స్థానికసంస్థల యుపాధ్యాయులుకూడ శిక్షాపాత్రులగుదురు.

---

# స్వవిషయము

**పత్రికానిర్వహణము:—**

పాఠక మహాశయులారా! మాపత్రి కాకుమారికి ఈ నెలతో ముప్పదియేండ్లు నిండుచున్నవి. మన తెలుఁగు దేశములో ఇంత దీర్ఘకాలము నిరంతరాయముగా వెలువడిన తెలుఁగు మాసపత్రిక ఇది యొక్కటేయని చెప్పుట సాహసముగాదు. అతిశయోక్తియును గాదు. అసలు పత్రికా నిర్వహణమునునది చాల కష్టసాధ్యమైన పని. అందులోను విద్యావిషయిక పత్రికలను నిర్వహించుట కడుంగడు కష్టము. మొట్ట మొదట విద్యా సంబంధములైన వ్యాసరాజములు లభించవలెను. తరువాత సమర్థుఁడగు సంపాదకుఁ డుండవలెను. ఆపైన పత్రికను పోషించుటకుఁ దగినంత మంది చందాదారులు గావలెను. ఇం

దేలోపము గలిగినను సమర్థించుకొనుటకు వలసినంత విత్తముండవలెను. పత్రికానిర్వహణమునం దిన్ని చిక్కులున్నను, ఈ యన్నింటిలో దేనికిని జిక్కక, స్రుక్కక కేవలము ప్రాథమిక విద్యాసేవయే తమ యాదర్శముగాఁ బెట్టుకొని, ధనలోపమును గూడ లెక్కసేయక, చివరకు నేటి యుద్ధ పరిస్థితులంబట్టి కాగితము కఱవైనను, విరమింపక, యింతకాలమునుండి యీపత్రికా రాజమునకు వ్యవస్థాపకులై దీనిని సర్వాంగ సుందరముగా నడుపుచున్న శ్రీ ఈదర వెంకయ్య పంతులుగా రెంతయుఁ బ్రశంస నీయులు. వీరికిఁ బ్రాథమిక విద్యాప్రపంచ మెంతయు ఋణపడి యున్నదనుటలో నేమాత్రము వింతగాని, సాహసమునుగాని లేదు. వీరియాదరణమున నీపత్రికారాజము చిరకాల మిట్లే భాషాసేవ యొనర్చుచు నుపాధ్యాయులయు, భాషాభిమానులయు, గౌరవాదరణములకుఁ బాత్రమై వర్ధిల్లుగాక !

**కృతజ్ఞత :—**

ఈ సంవత్సరము పొడుగునను మా పత్రికాకుమారిని తమతమయుత్తమభాషా ప్రసంగములతో విద్యావతిగా నొనర్చిన మావ్యాసకర్తలకును, మాపత్రికాకుమారి పట్ల మిక్కిలి యభిమానముచూపి ఆమె పోషణమున కేమిలోపము గలుగకుండఁ దగిన వార్షిక విరాళము లొసంగి ప్రోత్సాహమిచ్చిన మాచందాదారులకును మఱియు బహుముఖముల మా పత్రికాభివృద్ధికిఁ దోడ్పడిన తదితర ప్రముఖులకును, మాకృతజ్ఞతను దెలుపుచున్నాము. ఇదే ప్రకారము రాబోవు వత్సరమునఁగూడ వీరెల్లరు మాప్రతికా కుమారియెడల నాదరాభిమానములఁ జూపుదురుగాక యని మాప్రార్థన.

**మనవి:—**

ఇంతకాలమునుండియు నీ పత్రికా రాజము సర్వతోముఖముగా విద్యాసేవ యొనర్చుచున్నను, వ్యవస్థాపకులు దీనిని ఉపాధ్యాయుల సొత్తుగాఁ జేసియున్నను, గురుపరంపరాభిమానము నీ పత్రిక కోరుచున్నను, ఏకొలఁది మంది ప్రాథమికోపాధ్యాయులో తప్ప మిగిలినవారెల్లరు-ముఖ్యముగా ఉన్నత పాఠశాలోపాధ్యాయులేమి, బోధనాభ్యసన పాఠశాలోపాధ్యాయులేమి, విద్యాధికారులేమి, తక్కుంగల విద్యావేత్తలేమి ఈపత్రికపట్ల కనీసము వ్యాసరూపమునైనను దమ యాదరాభిమానములను జూపకుండుట చాల చింతింపఁదగిన విషయము. కాబట్టి యిప్పటి నుండియైన ఉపాధ్యాయవర్గము వారెల్లరును, విద్యాధికారులును, ఈ పత్రికకుఁ దమ యుత్తమరచనలఁ బంపి దీనిపట్ల తగినరీతిని తమ యాదరాభిమానములఁ జూపుదురుగాక యని మా వినయపూర్వకమైన మనవి.

**హెచ్చరిక:—**

సకాలమునకుఁ బత్రికలు చేరకున్నను, లోగడ సంచికలు కావలసి యున్నను, చందాదారులుగాని, వ్యాసకర్తలుగాని, నాకు వ్రాయకుండ ఏలూరు హెడ్డాఫీసు వారికే వ్రాయవలసినది. చందాదారులు క్రొత్తగా చేరువారుగాని, ప్రాతవారుగాని తమ చందాధనమును నాకు మాని, హెడ్డాఫీసుకు మాత్రమే పంపుకోవలెను. వ్యాసకర్తలు మాత్రము తమ రచనలను ప్రతినెల 4 వ తేదీలోపల నాకు చేరునట్లు

పంపుచుండవలెను. మఱియు వారు తమ వ్యాసకర్తలు నాతో నుత్తర ప్రత్యుత్తర
సంప్రాప్తి విలాసమును(పోష్టు, తాలూకా, జిల్లా) విడివిడి యక్షరములతో వ్రాసి పంపవలెను. తమ వ్యాసములను గుఱించి క్షేమైనను తెలిసికొనఁదలంచిన యెడల ములను జరుపవచ్చును.

విధేయుఁడు,
సంపాదకుఁడు.

---

# పోషకసంఘ సమావేశము

గుంటూరుతాలూకా రావెల గ్రామములో ది 27-2-42 తేదీ సాయంత్రం 4 గంటలకు మ. రా. శ్రీ S. వెంకట సుబ్బారావు మెడికల్ ప్రాక్టీషనరు గారి అధ్యక్షతక్రింద పోషకసంఘ సమావేశము జరిగెను. శ్రీ అధ్యక్షులు అంటువ్యాధులు వాని నివారణోపాయములు గూర్చి వివరించిచెప్పిరి. శ్రీ రావెల వెంకటసుబ్బారావు గారు యుద్ధ పరిస్థితులనగూర్చి వివరించిచెప్పి, శ్రీ మద్రాసు గవర్నరుగారి యుద్ధ నిధికి తమ చేతనయినంత సహాయముచేయుటకు ప్రతివ్యక్తియు తోడ్పడవలెననియు, ప్రస్తుతము మనగ్రామములో గ్రామాధికార్లనద్దనున్న యుద్ధ లాటరీటిక్కెట్లను ప్రతివారుతప్పక కొనవలెననియు చెప్పిరి. అంతటితో సభముగింపబడెను.

రావెల,
2—3—42.

ఇట్లు,
రావెల వెంకటసుబ్బారావు,
మేనేజరు - హిందూ ఎలిమెంటరీస్కూలు.

# ఉగాదిపండుగ కానుకలు

## బహుమానము గ్యారంటీ

సరియైన జవాబుకు రూ 10/- 1 తప్పుకు రూ 5/- 2 తప్పులకు రూ 3/-

శబ్దసమస్యా పూర్ణము నెం. 5 రు. ముగింపు తేది 7—4—1942.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | అ | | మా | న | ము |
| 2 | అ | భి | మా | | ము |
| 3 | | ప | కా | ర | ము |
| 4 | | ట | స్థ | ల | ము |
| 5 | వి | వా | | ము | లు |

1. గల్గినచోటునకు వెళ్లుటకష్టమే.
2. ఒక్కొక్కప్పుడు హానికల్గించును.
3. యిది చేసినవారిని ఎంతకాలము గడిచినను మరువ జాలము.
4. స్కూలుటీచరు ఒక్కొక్కప్పుడు ఈవిషయములో అబద్ధ మాడిన వాడగును.
5. వీనిచెంతయుండుట ఒక్కొక్కప్పుడు కష్టమే వాటిల్ల వచ్చును.

(1) అనుమానము, అవమానము (2) అభిమాదము, అభిమానము (3) అప కారము, ఉపకారము (4) ఆటస్థలము, తోటస్థలము (5) వివాదములు, వివాహములు ఈపదములనుండి మాత్రమే సరియైన సమాధానములనెత్తి పూరింపవలెను.

నిబంధనలు:-కూపను 1 కి రు 0-4-0 లు. 5 కూపనులు రు 1-0-0 ప్రతి పోటీ దారు అధమము రెండుకూపనులకు తక్కువపంపరాదు. తెల్లకాగితముమీద జవాబులు వ్రాసి పంపవచ్చును. సీల్డుకవరులోని జవాబుకో సరిపోయిన జవాబేసరిఅయిన జవాబు. అన్నివిషయములలోను మేనేజరు ఆర్డరు ఖాయమైనది. రుసుము మణియార్డరుమూల ముగా పంపుచూ కూపనులతో మణియార్డరు రసీదు జతపర్చవలెను. గెలుపొందినవారి పేర్లు ఈపత్రికలో ప్రచురించబడును. ది 7-4- 1942 తేదీన కూడ పోష్టుచేయవచ్చును. జవాబు నేరుగా తెలుపమని కోరేవారు 0-0-9 చీటి పంపుకోవలెను. కూపనులు రుసు ములు. యీాదిగువ అడ్రసునకు పంపండి.

మే నే జ రు

**ఆంధ్రభాషా కుటీరము**

రావెల, గుంటూరు జిల్లా.

---

# రామా అండ్ కో.,

హెడ్డాఫీసు:— ఏలూరు, బ్రాంచెస్:— మదరాసు-గుంటూరు.

వేమూరి వెంకట కృష్ణమసెట్టి అండ్ సన్సు వారి, ఎ. కణ్ణన్‌సెట్టి అండ్ కో., 286, ఎస్ప్లనేడు - మద్రాసు వారిచే ప్రచురింపబడుచుండెడి "ఆనందాశ్రమ గ్రంథ రత్నమాల" పుస్తకము లన్నిటికిని మేము సంపూర్ణ హక్కుదార్లమై యున్నాము. ఈ పుస్తకములకును యితర పుస్తకములకును, యీదిగువ చిరునామాకు వ్రాయవలయును. భారీగా ఆర్డరిచ్చువారికి మంచి కమీషను యివ్వఁబడును.

## శ్రీమద్భగవద్గీతా-ప్రతిపద టీకాభాష్య విశేషార్థ సహితము.

| | | | |
|---|---|---|---|
| క్యాలికో బైండు, గిల్టు పేరు గలది. | 3 | 4 | 0 |
| డిటో ఆంధ్రతాత్పర్య సహితము, క్యాలికో బైండు | 1 | 4 | 0 |
| డిటో డిటో పేపర్ బైండు | 1 | 0 | 0 |
| డిటో ఆంధ్రవచనము చిన్న సైజు, క్యాలికో బైండు | 0 | 6 | 0 |
| డిటో డిటో పేపర్ బైండు | 0 | 5 | 0 |

## శ్రీమదాంధ్రమహాభారతము.

| | | | |
|---|---|---|---|
| 1 ఆది, సభాపర్వములుగల సంపుటము | 2 | 0 | 0 |
| 2 అరణ్యపర్వము. | 2 | 0 | 0 |
| 3 విరాటోద్యోగ పర్వములు. | 2 | 0 | 0 |
| 4 కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీపర్వములు | 2 | 0 | 0 |
| 5 భీష్మ, ద్రోణ పర్వములు. | 2 | 0 | 0 |
| 6 శాంతిపర్వము. | 2 | 0 | 0 |
| 7 అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు గల సంపుటము. | 2 | 0 | 0 |
| 1 ఆదిపంచకము - ఒకటే సంపుటము | 5 | 8 | 0 |
| 2 యుద్ధషట్కము డిటో | 3 | 12 | 0 |
| 3 శాంతిసప్తకము. డిటో | 3 | 12 | 0 |
| భాస్కరరామాయణము | 4 | 0 | 0 |
| శ్రీకృష్ణకర్ణామృతము | 1 | 8 | 0 |
| శ్రీరామకర్ణామృతము. | 1 | 8 | 0 |
| భర్తృహరిసుభాషితము | 2 | 0 | 0 |
| అమరకోశము-త్రికాండము-సటీకము క్యాలికో బైండు చేయఁబడినది. | 1 | 4 | 0 |
| డిటో అట్టబైండు | 1 | 0 | 0 |
| హరిశ్చంద్రోపాఖ్యానము అట్టబైండు. | 0 | 6 | 0 |

## శ్రీమదాంధ్ర మహాభాగవతము
(పద్యకావ్యము-పోతనప్రణీతము)

| | | | |
|---|---|---|---|
| సంపూర్ణ ప్రతి ఒకే సంపుటము | 5 | 0 | 0 |
| సంపూర్ణప్రతి రెండుసంపుటములుగా | 6 | 8 | 0 |
| సంపూర్ణప్రతి మూఁడుసంపుటములుగా ప్రథమ, ద్వితీయ, తృతీయ చతుర్థస్కంధములు క్యాలికో బైండు గిల్టు పేరుగలది | 2 | 8 | 0 |
| పంచమ, షష్ఠమ, సప్తమ, అష్టమ, నవమస్కంధములుగల సంపుటము క్యాలికో బైండు, గిల్టు పేరుతో | 2 | 8 | 0 |
| దశమ, ఏకాదశ, ద్వాదశ స్కంధములు గల సంపుటము క్యాలికో బైండు, గిల్టు పేరు గలది. | 2 | 8 | 0 |
| గజేంద్రమోక్షము-క్యాలికో బైండు | 0 | 8 | 0 |
| డిటో అట్టబైండు | 0 | 6 | 0 |
| రుక్మిణీకల్యాణము-క్యాలికో బైండు | 0 | 8 | 0 |
| డిటో అట్టబైండు | 0 | 6 | 0 |
| నలచరిత్రము - అట్టబైండు. | 0 | 6 | 0 |
| ముకుందమాలా -సటీకాతాత్పర్యము. | 0 | 4 | 0 |
| ఆదిత్యహృదయము-సటీకాతాత్పర్యము. | 0 | 2 | 0 |
| నీతిశాస్త్రము, సటీకాతాత్పర్యము | 0 | 2 | 0 |
| భజగోవింద శ్లోకములు టీకాతాత్పర్యసహితము. | 0 | 2 | 0 |
| శ్రీలక్ష్మీనృసింహ స్తోత్రము. టీకాతాత్పర్య సహితము. | 0 | 2 | 0 |
| శ్రీ సహస్రనామ స్తబకము క్యాలికో బైండు చేయఁబడినది. | 0 | 8 | 0 |
| పేపరు బైండు | 0 | 6 | 0 |
| శ్రీ గోపాల సహస్రనామ స్తోత్రము | 0 | 1 | 0 |
| సప్తమస్కంధము - మూలము. | 0 | 3 | 0 |
| భోగినీ దండకము | 0 | 1 | 0 |

**రామా అండ్ కో., నెం 3, కార్పొరేషన్ ఫ్రూట్ మార్కెటు, మద్రాసు.**


శ్రీమదాంధ్ర మహాభాగవతము
పోతనామాత్య ప్రణీతము
శ్రీమదాంధ్ర మహాభాగవతము
ELLORE
రామా & కో.
ఏలూరు
మద్రాసు
అష్టాదశపురాణసారములు
అష్టాదశపురాణ
సారములు
ELLORE
రామా & కో.
ఏలూరు
మద్రాసు
Rs. 4/8
రామా అండ్ కో.
ఏలూరు
మద్రాసు